శ్రీమతే రామానుజాయ
నమః
శ్రీమద్ వరవరమునయే



# వేదవైభవం-2



భద్రాచలం శ్రీ సీతారామచంద్ర



'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ

సమర్పణ: వంగల వేంకట కేశవ



నావల్పాక్కమ్ యజ్ఞ వరాహాచార్య(కణ్ణన్)స్వామి వారు



శ్రీమాన్ ఈయుణ్ణి గోపాలకృష్ణమాచార్యస్వామివారు, వారి సతీమణి శ్రీమతి కమలమ్మగారు

# విజ్ఞాపన

భారతీయుల సంస్కృతికి, సంప్రదాయాలకు, జీవనశైలికి, గౌరవానికి మూలకారణం వేదం. ఆశయతు హిమాచల భారతీయుల అందరిని అనాదిగా ఒకే తాటిని నడిపే ఒక అద్భుత శక్తి వేదం. భారతదేశంలోని ఏ శాస్త్రమైనా, ఏ కళ అయినా దానికి మూలం వేదమే. వేదం లేకపోతే భారతదేశం లేదు అని అనడంలో సందేహం లేదు. మాక్సముల్లర్, కీత్ వంటి ఎందరో పాశ్చాత్యులు వేద వైభవాన్ని ప్రశంసించారు. భారతదేశంలో భారతీయ సాహిత్యంలోనే కాక, ప్రపంచ సాహిత్యంలోకూడా వేదం మొట్టమొదటి గ్రంథంగా అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. భారతీయ సంప్రదాయం ప్రకారం వేదం అనాది. అపౌరుషేయం. ప్రళయ కాలంలో కూడా అది నిలచి ఉంటుంది. సృష్టి కాలంలో భగవంతుడు దానిని తన సంకల్పంతో బహిర్గతం చేస్తాడు.

ఈ వేదాన్ని వివరించి గ్రంథాలు తరువాత కాలంలో ఎన్నో అవతరించాయి. స్మృతులు ఇతిహాసాలు, పురాణాలు మొదలైన గ్రంథాలు ఇటువంటివి. ఇతిహాసాలలో మొట్టమొదటి ఇతిహాసం శ్రీరామాయణం. ఇది వేదావతారూపంరగా పెద్దలచే కీర్తింపబడుతున్నది. భగవంతుడు శ్రీరాముడై అవతరించగా వేదం శ్రీ వాల్మీకి శ్రీరామాయణంగా అవతరించింది అని భారతీయుల విశ్వాసం. ఎన్నో వైదిక ధర్మాలు, సంప్రదాయాలు శ్రీరామాయణంలో మనకు అడుగడుగునా గోచరిస్తాయి. ఈ అంశాన్ని మనకు విజ్ఞులైన ఎంతోమంది పెద్దలు వివరించారు.

ఈ మధ్యకాలంలో విశేషించి వేదంలోని పలు రహస్యాలను ప్రపంచానికి తమదైన శైలిలో అందిస్తున్న మహనీయులు **నావల్ పాక్కమ్ యజ్ఞ వరాహాచార్య (కణ్ణన్)స్వామి** వారు. వీరు "శ్రీరామాయణంలో వేద మహిమ" అనే అంశాన్ని గురించి చేసిన అద్భుతమైన ఉపన్యాసంలోని విషయాలు ప్రస్తుత గ్రంథరూపంలో ఆస్తికపాఠకులకు నివేదింపబడుతున్నాయి.

ఈ గ్రంథం శ్రీమాన్ ఈయుణ్ణి కమలమ్మ గారు గోపాల కృష్ణమాచార్య స్వామి పుణ్య దంపతుల పవిత్ర స్మృతిగా నివేదింపబడుతున్నది. శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామి వారు నాకు వరుసకు చిన్నతాత అవుతారు. అంటే దాసుని పితామహులకు పినతండ్రి గారి కుమారులు. వీరు మంగళం పాడు గ్రామం లో 1922 వ సంవత్సరంలో జన్మించి తిరుపతి ఓరియంటల్ కాలేజిలో వ్యాకరణ శిరోమణి విద్యను అభ్యసించి తరువాత తిరుమల తిరుపతి దేవస్థానం కాలేజీలలో ఆంధ్రోపన్యాసకులుగా చిరకాలం ఉద్యోగం చేశారు. నిరాడంబరులు, సహృదయులు. శ్రీమతి కమలమ్మ గారు శ్రీమాన్ గోపాల కృష్ణమాచార్య స్వామి వారు దంపతులు బంధువులను ఆదరించిన తీరు అసాధారణమైనది. వీరి దగ్గరనే దాసుడు తిరుపతిలో నాలుగు సంవత్సరాల కాలం పాటు ఉండి ఉన్నత విద్యను అభ్యసించడం జరిగింది. అప్పుడు వీరు ఇరువురు నా పట్ల చూపిన ప్రీతి, వాత్సల్యం మరువలేనివి. వీరి ఋణం నిజంగా నేను తీర్చుకోలేను.

శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామి గారు జన్మించి ఈ సంవత్సరంతో నూరు సంవత్సరాలు పూర్తి అయినవి. ఈ పుణ్య దంపతుల పవిత్ర స్మృతిగా, శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామి వారి శతాబ్దిస్మృతి చిహ్నికగా ఈ గ్రంథం ప్రకాశింప చేయబడుతున్నది. శ్రీ గోపాలకృష్ణమాచార్య స్వామివారి జన్మ నక్షత్రం పునర్వసు. శ్రీరాముని జన్మనక్షత్రం కూడా పునర్వసుయే

అందుచేత శ్రీరామచంద్రుని పవిత్ర చరిత్రను తెలియజేసే శ్రీరామాయణ వైభవాన్ని ప్రకటించే ఈ గ్రంథాన్ని శ్రీరాముని జన్మనక్షత్రమే తమ జన్మ నక్షత్రంగా కలిగిన గోపాలకృష్ణమాచార్య స్వామి వారి ధర్మపత్ని శ్రీమతి కమలమ్మ గారి స్మృతి చిహ్నకగా ఈ గ్రంథం ఆస్తిక లోకానికి సమర్పింపబడుతున్నది.

భాగవతదాసుడు,

ఈ ఏ శింగరాచార్యులు.

# శ్రీరామాయణంలో వేదమహిమ

శ్రీరామాయణంలో వేద మహిమ పలుచోట్ల పలు విధాలుగా పలువురి చేత ప్రస్తుతింపబడింది. ఈ విషయం మహానుభావులైన విద్వాంసులకు తెలియనిది కాదు. అయినా, సామాన్యంగా జ్ఞానం కలిగినవారికి కూడా ఈ విషయం తెలియాలనే ఉద్దేశంతో ఈ వ్యాసం విన్నవింపబడుతున్నది. వేద మహిమను గూర్చి వాల్మీకి మహర్షి ఏ ఏ సందర్భాలలో ఏ ఏ రీతిలో ప్రస్తావించారు –అనే విషయాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

1) మొట్టమొదటగా గమనిస్తే, వాల్మీకి మహర్షియే స్వయంగా వేద మహిమను గూర్చి ప్రస్తావించారు.

2) తరువాత, కౌసల్య రామునితో మాట్లాడేటప్పుడు ఆమె వేద మహిమను గూర్చి పలికింది.

3) శ్రీరాముడు లక్ష్మణునితో పలికే సందర్భంలో వేదమహిమనుగూర్చిన ప్రస్తావించాడు.

4) జటాయువు రావణుని సవాలు చేస్తూ పలికే వచనాలలో వేదమహిమ వ్యక్తమవుతున్నది,

5) పరసపరం స్నేహం చేసుకునేటప్పుడు సుగ్రీవుడు రామునితో పలికే వచనాలలో వేద మహిమ వ్యక్తం అవుతున్నది

6) ఆశోకవనంలో సీతాదేవివిలాప వచనాలలో వేద మహిమ వ్యక్తమవుతున్నది,

7) యుద్ధానంతరం బ్రహ్మ చేసిన స్తుతిలో వేద మహిమ వ్యక్తమవుతున్నది.

8) తిరుమల నంబి భగవద్రామానుజులకు ఉపదేశించిన 18 శ్రీరామాయణ రహస్యాలలో " శ్రీరామాయణం వేదానికి ఉప బృంహణం" అనే వేద మహిమను తెలిపే అంశం మరొకటి.

ఈ విషయాలను యథావకాశంగా గమనిద్దాం.

మనం శ్రీ రామాయణాన్ని పారాయణం చేయడం ప్రారంభించే సమయాలలో అంతటా కొన్ని శ్లోకాలను ముందుగా పారాయణం చేసి, ఆ తర్వాత శ్రీరామాయణ పారాయణను ఆరంభించాలనే ఒక విలక్షణమైన, చక్కని వ్యవస్థను పెద్దలు ఏర్పాటు చేశారు. ఆ విధంగా ప్రారంభంలో మనం తప్పక అనుసంధించే శ్లోకాలలో –

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"
అనేది ఒక శ్లోకం.

పరమాత్మ వేదవేద్యుడు. వేదవేద్యుడు అంటే, వేదం చేత తెలియదగినవాడు. వేదం పరమాత్మను గూర్చి తెలుపుతున్నది. వేదంలో ఉండే అన్ని వాక్యాలు పరమాత్మను గూర్చినవే. ఈ విధంగా వేదం చేత ప్రతిపాదింపబడే పరమాత్మ ఒకానొక సమయంలో దశరథునకు కుమారుడై అవతరించగా, పరమాత్మను ప్రతిపాదించే వేదం కూడా శ్రీరామాయణ రూపంలో అవతరించింది. పరమాత్మ దశరథ కుమారుడై అవతరించినప్పుడు, వేదం రామాయణం అవతరించింది వేద ప్రతిపాద్యుడైన భగవంతుడు దశరథుని నుండి అవతరించగా, ఆ వేదం ప్రాచేచసుడనబడే వాల్మీకి వలన అవతరించింది.

శ్రీరామాయణ పారాయణం ప్రారంభంలో అనుసంధింపబడే ఈ శ్లోకం ద్వారా మనకు ఏమి తెలుస్తున్నది? అంటే,

1) పరమాత్మ వేదవేద్యుడు వేదైకవేద్యుడు. వేదంచే మాత్రమే తెలియదగినవాడు అనే అవధారణను ఇక్కడ గ్రహించాలి. "శాస్త్రయోనిత్వాత్" అని బ్రహ్మసూత్రం పరమాత్మ వేదం వల్లనే తెలియడానికి వీలైనవాడు, ఇక వేరు దీనివల్ల తెలియడానికి సాధ్యం కాని వాడు –అని తెలియజేస్తున్నది. ఈ బ్రహ్మ సూత్రంలో కూడా "శాస్త్రమేవ యోనిః" అనే అవధారణను చెప్పుకోవాలి కదా.

2) ఇక్కడ రెండవ విషయం ఏమంటే– భగవంతుడు అవతరించినట్లుగా వేదం కూడా అవతరిస్తుంది అనేది. భగవంతు డు శ్రీరామకృష్ణాధి రూపాలలో అవతరించినట్లుగా, వేదం శ్రీరామాయణం మొదలైన వేదోప బృంహణాల రూపంలో అవతరిస్తున్నది.

3) మూడవ విషయం ఏమంటే–దశరథుని వలె వాల్మీకి, పరమ పురుషుని వలె శ్రీరాముడు, వేదం వలె శ్రీరామాయణం –అనే ఉపమా పరంపర ఇక్కడ ధ్వనిస్తున్నది–అని.

దశరథుని వలె వాల్మీకి –అని అనడం ఎందుకంటే, దశరథుని నుండి శ్రీరాముడు జన్మించినట్లుగా, వాల్మీకి నుండి శ్రీరామాయణం అవతరించింది కనుక. పరమ పురుషుని వలె శ్రీరాముడు –అని అనడం ఎందుకంటే, ఆ పరమ పురుషుడే శ్రీ రాముడుగా అవతరించాడు కనుక. వేదం వలె శ్రీరామాయణం– అని అనడం ఎందుకంటే, వేదమే శ్రీరామాయణంగా అవతరించింది కనుక.

4)ఈ మూడు విషయాలతో పాటు ఈ శ్లోకంలో మనం తెలియదగిన ఇంకొక విషయం ఏమంటే – వేద్య వేదక భావం అవతారంలో కూడా అనువర్తిస్తున్నది– అనేది. అంటే, అవతారానికి ముందు వేదం ఏ

కార్యమైతే చేసిందో, ఆ కార్యాన్నే వేదం శ్రీరామాయణంగా అవతరించినప్పుడు కూడా చేసినది– అని. ప్రారంభంలో వేదం ఏమి చేసింది? భగవంతుని యొక్క స్వరూప రూపగుణ విభూతులను అన్నిటిని చక్కగా వర్ణించినది కదా. ఆ వేదం శ్రీ రామాయణంగా అవతరించినప్పుడు ఏమి చేసింది? ఆ విధంగా శ్రీరాముడై అవతరించిన పరమాత్మ యొక్క స్వరూపరూప గుణవిభూతులను చక్కగా వర్ణించింది. ఈ విధంగా వేదానికి, భగవంతునికి మధ్య ఉండే "తెలియబడేవాడు –తెలియజేసేది " (వేద్యవేదకభావం) అనే సంబంధం ఈ ఇద్దరి అవతార దశలో కూడా కొనసాగినది.

ఈ విధంగా, శ్రీరామాయణ పారాయణ ప్రారంభంలో అనుసంధింపబడే ఈ శ్లోకంలో మనం నాలుగు విధాలైన తత్త్వాలను గమనించవచ్చు.

ఈ విధంగా శ్రీరామాయణంలో ఉండే నాలుగు విధాలైన గొప్పతనాలను కీర్తిస్తున్న ఈ శ్లోకరత్నాన్ని మనం ముందుగా వాక్కుతో పలుకుతూ, దాని అర్థాన్ని మనస్సుతో స్మరిస్తూ శ్రీరామాయణ పారాయణను ఆరంభం చేయాలి –అనే ఒక చక్కని క్రమాన్ని మనకు అందించిన పెద్దలకు, మన పూర్వాచార్యులకు మనం భక్తిపూర్వకంగా శిరసా నమస్కరిద్దాం. ఇక, శ్రీరామాయణంలో ఎక్కడెక్కడ వేదమహిమ ప్రస్తుతింపబడిందో, ఆ విషయాన్ని క్రమంగా గమనిద్దాం.

శ్రీరామాయణంలో –బాలకాండ నుండి ఉత్తరకాండం వరకు మొత్తం ఏడుకాండలు ఉన్నాయి. శ్రీరామాయణంలో ఒక్కొక్క కాండలోనూ వేద మహిమ ప్రస్తావన మనకు గోచరిస్తుంది. ఈ విషయంతో పాటు, సాంప్రదాయకమైన వేరొక విషయం కూడా ఈ వ్యాసంలో చివర ప్రస్తావింపబడుతుంది. భగవద్రామానుజులు తమ

మేనమామ గారు అయిన తిరుమలనంబి సన్నిధిలో ఒక సంవత్సరం కాలంపాటు శ్రీరామాయణంలోని విశేషమైన అర్థాలను శ్రవణం చేశారు –అని వారి చరిత్ర తెలుపుతున్నది. తిరుమల నంబి శ్రీ రామానుజులకు 18 విధాలయిన, విశేషమైన శ్రీరామాయణార్థాలను ఉపదేశించారు. ఆ ఉపదేశాలలో మొట్టమొదటి ఉపదేశం ఏమంటే, శ్రీరామాయణం వేదానికి ఉపబృంహణరూపం –అనేది.

వాల్మీకి రామాయణంలోని ఒక్కొక్క కాండలోనూ వేద మహిమ ప్రస్తావన కనిపిస్తున్నదని అనుకున్నాము కదా. మొట్ట మొదటి కాండ అయిన బాలకాండ ఆరంభంలోనే, శ్రీరామ కథ ఆరంభం అవడానికి ముందుగా, శ్రీరామాయణ అవతార ప్రస్తావన సందర్భంగా మనకు వేద మహిమ ప్రస్తావన కనిపిస్తుంది శ్రీరామాయణం ఏవిధంగా అవతరించింది? అది కుశలవుల ద్వారా ఏ విధంగా ప్రచారం చేయబడింది? అనే సంగతిని తెలియజేసే వృత్తాంతం ఒకటి ఉన్నది. ఆ వృత్తాంతంలో గోచరించే ఒక శ్లోక రత్నాన్ని చిత్తగించండి.

"స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ,
వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః. "

ఈ శ్లోకంలో విశేషం ఏమంటే –వాల్మీకి తనను స్వయంగా "ప్రభుః " అనే పదంతో నిర్దేశించుకుంటున్నారు. కుశలవులు ఇద్దరూ శ్రీరాముని కుమారులు. వారిని ఇద్దరినీ వాల్మీకి శ్రీరామాయణాన్ని ప్రచారం చేయడం కోసం స్వీకరించాడు– అని ఈ శ్లోకంలోని భావం. ఆ కుశలవులు ఇద్దరూ మేధావులట. మేధావులు అంటే– బుద్ధి కుశలత కలిగిన వారు –అని అర్థం. అంతేకాక, వారు

వేదంలో పరినిష్ఠితులట. అంటే వేదాన్ని అర్థంతో పాటుగా అధ్యయనం చేసినవారు –అని అర్థం. ఈ విధంగా వేదంలో పరినిష్ఠను కలిగినవారు కుశలవులు– అని గమనించిన వాల్మీకి, వేదోపబృంహణం కోసం, "తావగ్రాహయత" – వారిని ఇద్దరినీ గ్రహించాడు. లోకంలో వేదాన్ని అంతటా వివరించి, ప్రచారం చేయడం కోసం వారిని స్వీకరించారు. ఉపబృంహణం అంటే– వివరించడం. శ్రీరామాయణంలోకంలో ప్రచారం చేయబడితే, దానివల్ల వేద తత్వాలు అన్నీ చక్కగా లోకంలో ప్రచారం అవుతాయి అందుకోసం సమర్థులైన శిష్యుల కోసం వాల్మీకి మహర్షి అన్వేషిస్తూ ఉండగా, అతని అదృష్టవసంచేత ఆ మహత్కార్యానికి సమర్థులైన కుశలవులు ఇద్దరూ అతనికి లభించారు. వాల్మీకి మహర్షి కూడా సమర్థుడు కనుక, వారిలోని సామర్థ్యాన్ని గమనించి, శ్రీరామాయణాన్ని లోకంలో ప్రచారం చేయడం ద్వారా వేద తత్వాలను, సనాతనమైన వైదికమైన సంస్కృతీ సంప్రదాయాలను జగత్తులో వ్యాప్తి చేయడం –అనే గొప్ప కార్యం వారి వల్ల సిద్ధించగలరని తెలిసికొని, వారిని ఆ కార్యం కోసం ఎన్నుకున్నాడు.

వేద తత్వాలను ప్రచారంచేయాలంటే, ముఖ్యంగా రెండు విధాలయిన యోగ్యతలు ఉండాలి. అందులో మొదటిది– మేధావిగా ఉండడం, రెండవది వేదంలో పరిపూర్ణమైన నిష్ఠను కలిగి ఉండాలి. ఈ రెండు కలిగి ఉన్నవారే శ్రీ రామాయణాన్ని ప్రచారం చేయడం ద్వారా వేద తత్వాలను, వైదిక సంప్రదాయాన్ని వ్యాప్తి చేయగలరు. ఈ ముఖ్యమైన విషయాన్ని వాల్మీకి గ్రహించి, దానికి తగినట్లు పైన పేర్కొన్న, రెండు విశేషమైన యోగ్యతలను కలిగిన కుశలవులను తనకు శిష్యులుగా ఎన్నుకున్నాడు.

సీతాకుమారులైన వారిద్దరూ వాల్మీకి ఆశ్రమంలోనే ఉన్నారు వారికి వాల్మీకి శ్రీరామాయణాన్ని నేర్పించాడు.

ఈ శ్లోకాన్ని అనుగ్రహించడం ద్వారా వాల్మీకి మనకు కొన్ని ముఖ్యమైన తత్త్వాలను తెలియజేస్తున్నారు. అవి ఏమంటే–

1) మేధావులు మాత్రమే వేదంలో పరినిష్ఠను పొందగలరు. మేధస్సు తక్కువగా ఉన్నవారు వేదాధ్యయనాన్ని చేస్తే చేయవచ్చు గాని, అది అధ్యయనంతో మాత్రమే ముగిసిపోతుంది. కేవలం వేదాన్ని అధ్యయనం చేయడంతో సరిపోదు, వాటిని వేదాంగాల పురస్సరంగా అధ్యయనం చేయాలలంటే. నిండయిన పాండిత్యం కలగాలంటే, విశేషమైన బుద్ధిని కలిగి ఉండాలి. అది ఉన్నప్పుడే ఈ రెండు సిద్ధిస్తాయి.

2) వేదంలో పరిపూర్ణమైన నిష్ఠను కలిగినవారే వేదోపబృంహణంలో కూడా యోగ్యతను కలవారు అవుతారు. అటువంటివారి వల్లనే లోకంలోనివారు కూడా ఉపకారాన్ని పొందుతారు. అల్పమైన బుద్ధిని కలవారు శ్రీరామాయణ ప్రవచనం చేసినవారు అయితే, వారివల్ల లోకంలో పెద్ద ఉపయోగం ఉండదు. ఎంతోమంది లోకంలో శ్రీరామాయణాన్ని చెబుతున్నారు. ఆ ఇతిహాసకథను ప్రచారం చేస్తున్నారు, సరే. అది అంతమాత్రంతో చాలదు. తిరుమలనంబి శ్రీరామానుజులకు శ్రీరామాయణాన్ని ప్రవచనం చేశారు కదా ఆ విధంగా ప్రచారం చేయాలి. అటువంటి మేధావులు ప్రచారం చేయాలి. ఆ విధంగా ప్రచారం చేయాలంటే శ్రీరామాయణమనేది వేదోప బృంహణ రూపం –అనే దృష్టితో ప్రచారం చేయాలి. శ్రీరామాయణాన్ని, వేదాన్ని మేళవించి వివరిస్తూ

ప్రచారం చేయాలి. దానికి తగిన బుద్ధి కుశలతను కలిగినవారు కావాలి. ఇటువంటి వారే ఈ మహత్కార్యాన్ని సాధించగలరు. ఇటువంటి కార్యాన్ని సాధించాలంటే వేదంలో నిష్ఠను కలవారు మాత్రమే సాధించగలరు. అందువల్ల, శ్రీరామాయణ ప్రవచనం చెయ్యాలంటే, వేదాలలో, వేదాంగాలలో పరిపూర్ణమైన పాండిత్యం ఆవశ్యకం అవుతున్నది.

3) ఇక మూడవ విషయం ఏమంటే– వేదం ఉపబృంహణాన్ని అపేక్షిస్తున్నది –అనేది. ఇటువంటి మహర్షి వేదంలోని కొలుచోట్ల ఉండే పలు అర్థాలు మనకు అర్థమయ్యే అవకాశం లేదు. వేదం తనలోని ఆశయాన్ని అన్ని చోట్ల స్పష్టంగా వ్యక్తం చేయదు. అందువల్ల తమిళంలో వేదానికి "మఱై "అని పేరు. అంటే తనలోని అర్థాన్ని యోగ్యత లేనివారికి తెలియకుండా ఉండేటట్లు గోప్యంగా, రహస్యంగా దాచిపెడుతున్నది– అని అర్థం. అందువల్ల వేదంలోని అర్థం స్పష్టంగా ప్రకాశించాలంటే, ఆ వేదం ఉపబృంహణాలను అపేక్షిస్తున్నది. అటువంటి ఉపబృంహణ గ్రంథాలను వాల్మీకి వ్యాసశుకమనుపరాశరాదిమహర్షులు అనుగ్రహించారు. ద్రావిడ భాషలో మహనీయులైన దివ్యసూరులు అనబడే అళ్వారులు అటువంటి దివ్య ప్రబంధాలను అనుగ్రహించారు.

వేదం, తనలోని అర్థాన్ని స్పష్టంగా వ్యక్తం చేయడం కోసం ఉపబృంహణాలను అపేక్షిస్తున్నది –అంటే, అది వేదానికి ఒక కొరత కాదా! – అనే సందేహం పని లేదు. ఇది ఒక విధంగా వేదానికి అతిశయమే. వేదమనే ఈ శాస్త్రం తనను అనుసరించి ప్రవర్తించిన ఎన్నో గ్రంథాలకు ఆధారమవుతున్నదనే అతిశయం దానికి కలుగుతున్నది కదా. ఎన్నో లక్షలాది గ్రంథాలు లోకంలో

వేదోపబృంహణాలుగా అవతరించాయి. ఇది ఒక విధంగా వేదానికి అతిశయమే కదా

4) ఇక ఈ సందర్భంగా గమనించవలసిన నాలుగవ విషయం ఏమంటే –వేద విద్య అనేది ఒకనికి విలక్షణమైన యోగ్యతను, అధికారాన్ని కలిగిస్తుంది– అనేది. వాల్మీకి మహర్షి వేదోపబృంహణం కోసం కుశలవులను స్వీకరించాడు, "తావగ్రాహయత" అంటే, దానికి ఏమి కారణం? వారిద్దరూ వేద విద్యలో పరిపూర్ణమైన యోగ్యతను కలిగిన వారు కావడమే కదా. ఆ వేద విద్యను కూడా ఆ కుశలవులు సాక్షాత్తుగా వాల్మీకి మహర్షి వల్లనే పొందారు. అటువంటి, వారికి గల, వేద విద్య వల్ల కలిగిన విశేషమైన యోగ్యతను గమనించిన వాల్మీకి, వారిని ఇద్దరిని ఒక ముఖ్యమైన, లోకోపకారకమైన మహత్కార్యాన్ని నిర్వహించడం కోసం తగినవారిగా భావించి ఎన్నుకున్నాడు.

ఈ విధంగా బాలకాండలో గోచరించే ఈ శ్లోకం ఇన్ని విధాలయిన వేదమహిమలను మనకు తెలియజేస్తున్నది.

ఇంతకు ముందు ప్రసంగంలో ఉపబృంహణం అనే ఒక పదం ప్రస్తావనకు వచ్చింది. ఉపబృంహణం అంటే ఏమి? అనే విషయాన్ని శ్రీరామాయణ వ్యాఖ్యానమైన గోవిందరాజీయం మనకు తెలుపుతున్నది. శ్రీరామాయణానికి గోవిందరాజులు అనే ఒక పూర్వాచార్యులు భూషణం అనే ఒక గొప్ప వ్యాఖ్యానాన్ని రచించారు. అందులో తిరుమలనంబి ఏ ఏ విశేషాలను శ్రీరామానుజులకు అనుగ్రహించారో, వాటి వివరాన్ని మనకు తెలియజేశారు. అంతేకాక, ఆ యా శ్లోకాల సందర్భాలలో తిరుమల నంబి ఏఏ అర్థాలను భగవద్రామానుజులకు అనుగ్రహించారో,

వాటిని కూడా తెలియజేశారు. ఉపబృంహణం అనే పదానికి ఏమి అర్థమో, దానిని కూడా వారు తమ వ్యాఖ్యానంలో ఒక వాక్యం ద్వారా తెలియజేశారు. ఆ వాక్యం ఏమంటే – "ఉపబృంహణం నామ నానాశాఖానుసారేణ వేదార్థప్రతిపాదకో గ్రంథః" అని. ఉపబృంహణం అంటే– పలు వేదశాఖలను అనుసరించి వేదార్థాన్ని ప్రతిపాదించే గ్రంథం. వేదంలో ఎన్నో శాఖలు ఉన్నాయి. ఇపుడు ఈ కాలంలో వాటిలో ఏదో ఒక శాఖను మాత్రం తెలుసుకుంటేనే పూర్ణ వేదాధ్యాయిగా లెక్కింపబడుతున్నారు. వాస్తవానికి ఆ విధంగా కాదు. పూర్ణం అంటే అన్ని శాఖలు అని కదా అర్థం. అన్ని శాఖలను అధ్యయనం చేసినప్పుడే పూర్ణ వేదాధ్యాయి అవుతాడు. ఆ వేదశాఖలను అనుసరించి వేదార్థాన్ని వివరించే గ్రంథానికి ఉపబృంహణం –అని పేరు. మనం ఇప్పుడు వేదంలో ఏదో ఒక్కొక్క శాఖను మాత్రం ఈనాడు అధ్యయనం చేస్తున్నాము. కాని, మహర్షులైన వాల్మీకి మొదలైనవారు పలు శాఖలను అధ్యయనం చేసినవారు. మిగిలిన శాఖలనుకూడా సాక్షాత్కరించుకోగలిగినవారు. అందువల్ల వారు వేదాలను ఉపబృంహణం చేయగలిగినవారయ్యారు. " అయం చ ప్రబంధో వేదోపబృంహణ రూపః"– ఈ శ్రీరామాయణం వేదార్థాన్ని విశదీకరించడం కోసం వచ్చిన గ్రంథమని గోవిందరాజులు అన్నారు. ఈ విషయమే తిరుమలనంబి భగవద్రామానుజులకు తెలియజేసిన 18 విధాలైన విశేషార్థాలలో మొట్టమొదటి విశేషార్థం. అంటే, శ్రీరామాయణ మహా గ్రంథం అనేది వేదార్థాన్ని విశదీకరించడం కోసం అవతరించిన గ్రంథం– అనేదే వారు ఉపదేశించిన మొట్టమొదటి విశేషార్థం. ఇప్పుడు ఆ విషయాన్ని మనం విస్తృతంగా గమనించబోవడం లేదు. కానీ, శ్రీరామాయణంలో

ఎక్కడెక్కడ కథా సందర్భంగా వేదమహిమను గురించిన ప్రస్తావనలు చోటుచేసుకున్నాయో, ఆ విషయాన్ని. మాత్రం సంగ్రహంగా గమనిద్దాం.

ఆశ్చర్యమేమంటే, వాల్మీకి మహర్షి కథావిషయంగా ఆవశ్యకత లేని సందర్భాలలో కూడా ఈ వేద మహిమను ప్రస్తావన చేసిన వైనాన్ని మనం గమనించవచ్చు. ఆయా సందర్భాలలో వేద మహిమను గురించిన ప్రస్తావన లేకపోయినా, కథాగమనానికి ఏ విధమైన లోటు లేకపోయినా, అటువంటి సందర్భాలలో కూడా వాల్మీకి మహర్షి వేదమహిమను ప్రస్తావించారంటే, ఆ విషయాన్ని తెలియజేయడంలో ఆ మహర్షికి కల అభిముఖ్యం ఎంతటిదో మనం గమనించవచ్చు. ఇప్పుడు అయోధ్యకాండలోని కొన్ని సూక్తులను గమనిద్దాం.

"ప్రవిశ్య ప్రథమాం కక్ష్యాం ద్వితీయాయాం దదర్శ సః,
బ్రాహ్మణాన్ వేద సంపన్నాన్ వృద్ధాన్ రాజ్ఞాభిసత్కృతాన్,
ప్రణమ్య రామః తాన్ వృద్ధాన్ తృతీయాయాం దదర్శ సః"

దశరథుడు రాముని అరణ్యానికి వెళ్ళమని చెప్పాడు. అతని మాట ప్రకారం అరణ్యానికి వెళ్లాలని శ్రీరాముడు నిశ్చయించుకున్నాడు. తరువాత, శ్రీరాముడు తన తల్లి అయిన కౌసల్యాదేవి ఉండే భవనానికి వస్తున్నాడు. రాముడు అరణ్యానికి పోబోతున్న విషయం తెలియదు. ఆమెకు ఆ విషయాన్ని తెలియజేయడం కోసం శ్రీరాముడు ఆమె దగ్గరకు వెళుతున్నాడు. ఆ సందర్భంలో శ్రీరాముడు కౌసల్య భవనాన్ని ప్రవేశించే సందర్భాన్ని వాల్మీకి మహర్షి వర్ణిస్తున్నారు. కౌసల్య భవనానికి చాలా కక్ష్యలు ఉన్నాయి. అందులో మొదటి కక్ష్యను దాటి రెండవ కక్ష్యను ప్రవేశించేటప్పుడు శ్రీరాముడు అక్కడ " బ్రాహ్మణాన్ వేద

సంపన్నాన్ వృద్ధాన్ రాజ్ఞాభిసత్కృతాన్" అని చెప్పిన రీతిలో వేదమనే శాస్త్రాన్ని చక్కగా అధ్యయనం చేసిన, వయసు మీరిన మహనీయులను దర్శించాడు. వారిని కౌసల్య మాత్రమే కాదు, ప్రభువైన దశరథుడు కూడా వారిని చాలా విశేషంగా సత్కరించేవాడు. మిక్కిలి గౌరవంతో వారిని కౌసల్య భవనంలో ఉండేటట్లు ఏర్పాటు చేశాడు. అటువంటి వేదసంపన్నులయిన బ్రాహ్మణులను శ్రీరాముడు సగౌరవంగా నమస్కరించి, తరువాత మూడవ కక్ష్యలోకి ప్రవేశించాడు. ఈ విధంగా శ్రీరాముడు తన తల్లి కౌసల్య గృహానికి వెళ్లేటప్పుడు దారిలో ఎవరెవరిని దర్శించాడు? దర్శించి ఏ విధంగా ప్రవర్తించాడు? అనే విషయాన్ని పై సూక్తులు మనకు తెలియజేస్తున్నవి.

ఈ సూక్తుల ద్వారా మనకు గోచరించే వేదమహిమను ఇప్పుడు కొంచెం గమనిద్దాం.

1) ఇక్కడ మనకు గోచరించే మొట్టమొదటి విషయం ఏమంటే, కౌసల్య వేద పండితులను మిక్కిలి ఆదరంతో గౌరవించేది –అని. ఆమె వేద పండితులను సత్కరించడమే కాదు, వైదికమైన కర్మలను ఆచరించడంలో కూడా ఆమె మిక్కిలి శ్రద్ధను కలిగినది– అని. శ్రీరాముడు ఆమెను చూడడానికి వెళ్ళిన సమయంలో ఆమె హోమాన్ని చేస్తున్నట్లు అక్కడ చెప్పబడింది. వేదవిహితమైన కర్మల విషయంలో ఆమెకు శ్రద్ధ మిక్కిలిగా ఉన్నది– అని, దశరథుని పత్నులు ముగ్గురిలో కౌసల్య వైదిక కర్మల విషయంలో మిక్కిలి శ్రద్ధ కలిగినది అని. –అని ఇక్కడ వాల్మీకి మహర్షి సూచిస్తున్నారు.

2) శ్రీరాముడు దర్శించిన వేద పండితులను వాల్మీకి మహర్షి "వేదసంపన్నాన్" అనే పదంతో నిర్దేశించారు. అంటే వారు వేదాన్ని గొప్పధనంగా భావించారు –అని అర్థం. లోకంలో ఉండే సామాన్య జనం ఏ విధంగా ధన ధాన్యాధులను గొప్ప సంపదగా భావిస్తారో, ఏ విధంగా వాటికోసం అన్వేషిస్తారో, నిత్యం ప్రయత్నం చేస్తారో, ఆ విధంగా ఇక్కడ ఈ బ్రాహ్మణులు ఆ ధన ధాన్యాధుల కంటే గొప్పగా వేదాన్ని భావించి, దానినే గొప్పధనంగా గౌరవిస్తున్నారు. అందుకోసమే నిత్యం అన్వేషిస్తున్నారు, తాము పొందిన ఆ సంపదను కోల్పోకుండా ఉండడం కోసం ఏమేమి ప్రయత్నాలను చేయాలో, ఆ ప్రయత్నం ప్రయత్నాలను అన్నిటినీ వారు చేస్తున్నారు. అందుకోసమే తమ ఆయుస్సును వెచ్చిస్తున్నారు.

వేదాన్ని గొప్ప సంపదగా చెప్పవచ్చునా? అని అంటే, ఆ విషయానికి సమాధానం వేదమే తెలుపుతున్నది– " ఋచో యజూంషి సామాని, సా హి శ్రీరమృతా సతామ్" అని అంటూ. "లోకంలోని జనులారా! మీరంతా కొద్దికాలంలోనే నశించిపోయే ధనం కోసం ప్రయత్నం చేస్తున్నారే! దానికోసమే జీవితాన్ని అంతటినీ వ్యర్థం చేస్తున్నారే! కానీ, ఏనాటికి తరగని, నశించని ధనం ఒకటి ఉన్నది. అది ఏమిటో తెలుసునా? "అమృతా శ్రీః" అని కీర్తింపబడే ఋగ్వేద యజుర్వేద సామవేదాలనే మూడు వేదాల రూపంలోని ధనమే అది. మహాత్ములకు ఏనాడు నశించని, నిత్యమైన సంపదయే ఈ వేదధనం. " అని అంటూ అని అంటూ వేదమే ఏనాటికి నశించని గొప్పధనం వేద ధనమని తెలుపుతున్నది.

3) ఆ విధంగా వేదాన్ని ధనంగా భావించి, కాపాడుకుంటున్న, మహనీయులైన బ్రాహ్మణులను దశరథుడు కౌసల్యాదేవి

అంతఃపురంలోని రెండవ కక్ష్యలో ఉండేటట్లు నియమించాడు. వారిని విశేషంగా సత్కరించాడు.

4) శ్రీరాముడు తన తల్లి భవనానికి వెళ్లేటప్పుడు వారిలో రెండవ కక్షలో తనకు కనిపించిన వేద సంపన్నులయిన బ్రాహ్మణులను ఉపేక్షించలేదు, వారిని చాలా గౌరవంతో నమస్కరించి, వారి విషయంలో తనకు గల ఆదరాన్ని వ్యక్తీకరించాడు. వారిని నమస్కరించిన తరువాతనే కౌసల్య దగ్గరకు వెళ్ళాడు కౌసల్యను చూడాలని ఆతురత అతనికి ఎంతగా ఉన్నప్పటికీని, వేద సంపన్నులైన బ్రాహ్మణులను నమస్కరించడం మాత్రం అతడు మరచిపోలేదు, మానలేదు.

5)ఈ విధంగా అతడు వేదసంపన్నులయిన బ్రాహ్మణులను గౌరవంగా నమస్కరించడంలో ఒక ధర్మ సూక్ష్మం కూడా ఉన్నది. దానిని వాల్మీకి మనకు సూచించారు. రాముడు ఎల్లప్పుడూ తన తల్లిదండ్రులను ఎంతో గౌరవించే స్వభావం కలిగినవాడు. తన తల్లిదండ్రులైన కౌసల్యా దశరథులు ఇద్దరూ వేద పండితులను మిక్కిలి గౌరవంతో సత్కరించే స్వభావాన్ని కలిగిన వారు. తాను ఆరాధించే తల్లిదండ్రులు గౌరవించేవారిని తాను గౌరవించవలసిన కర్తవ్యం తన పైన ఉన్నదనే ధర్మ సూక్ష్మాన్ని రామచంద్రుడు గుర్తించాడు. అందువల్ల అతడు ఆ వేద పండితులను విశేషంగా గౌరవించాడు. ఇప్పుడు శ్రీరామచంద్రుడు అరణ్యానికి వెళ్లడం కూడా పితృ వాక్య పరిపాలన కోసమే కదా. ఆ విధంగా తండ్రి మాటను పాటించేవాడు, తండ్రి అనుసరించే మార్గాన్ని అనుసరిస్తాడు కదా. దశరథుడు వేదపండితులను సత్కరించారనే ధర్మాన్ని అనుష్ఠించేవాడు కనుక, ఆ ధర్మాన్ని రామచంద్రమూర్తి కూడా శిరసా వహించి, దానిని పాటించాడు. ఈ

రీతిలో కూడా శ్రీరామచంద్రుడు పితృభక్తిని వ్యక్తం చేశాడు –అని గమనించాలి

దీనినిబట్టి, "వేద సంపన్నులైన మహనీయులను గౌరవించాలి" –అనేది విలక్షణమైన, సనాతనమైన సంప్రదాయం అనే విషయం మనకు ఇక్కడ స్పష్టపడుతున్నది.

" తస్మాత్ బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివే దివే నమస్కుర్యాత్"
"అందువల్ల వేద విదులైన బ్రాహ్మణులకు ప్రతి దినం నమస్కరించాలి".

శ్రీరాముడు తన తల్లి కౌసల్యాదేవి భవనంలో ఆమెను చూచి, తన వనగమన వార్తను ఆమెకు తెలియజేసే సందర్భం ఇది. ఈ సందర్భం అయోధ్యకాండలో మనకు గోచరిస్తుంది. కౌసల్య ఎన్ని విధాలుగానో శ్రీరామునితో వనానికి వెళ్ళవద్దని నచ్చజెప్పడానికి ప్రయత్నం చేసింది. కానీ, శ్రీరాముడు ఆమె మాటను వినలేదు. వనానికి వెళ్లాలనే తన దృఢమైన నిశ్చయాన్ని ఆమెకు తెలియజేశాడు. ఇక చేసేది ఏమీ లేకుండా ఉన్నందున, కౌసల్యాదేవి చివరిగా అతడు వెళ్లే సమయంలో అతనికి మంగళాశాసనం చేస్తున్నది. అప్పుడు కౌసల్యాదేవి ఏ విధంగా శ్రీరామునకు మంగళాన్ని ఆశాసిస్తున్నదో గమనిద్దాం.

"శ్రుతిః స్మృతిశ్చ ధర్మశ్చ పాతు త్వాం పుత్ర సర్వశః"

"కుమారా! నిన్ను శ్రుతి స్మృతి, ధర్మం అనేవి రక్షించాలి. ఎందుకంటే, నిన్ను రక్షించవలసిన నిన్ను కన్న తల్లిదండ్రులు కూడా నిన్ను రక్షించలేని ఈ సమయంలో, ఇక నిన్ను రక్షించగలిగినది వేదం, దానిని అనుసరించి వర్తించే స్మృతి, ఆ

వేదం విధించే ధర్మం అనేవే సుమా. అవి నిన్ను రక్షించాలి" అని కౌసల్య దేవి శ్రీరామునకు మంగళాశాసనం చేస్తున్నది.

"ఋషయః సాగరాః ద్వీపాః వేదా లోకా దిశశ్చ తే,
మంగళాని మహాబాహో! దిశంతు శుభ మంగళమ్"

అని అంటూ కౌసల్యాదేవి మంగళ శాసనం చేసి శ్రీరాముని పంపుతున్నది. "ఓ మహా బాహూ! ఋషులు, సాగరాలు, ద్వీపాలు, వేదాలు, లోకాలు, అన్ని దిక్కులు నీకు అన్ని విధాలైన శుభాలను కలిగించాలి " అని అంటున్నది.

ఇక్కడ కూడా కౌసల్య వేదాలు, ఆ వేదాలను దర్శించిన ఋషులు, ఆ వేదాలలో చెప్పబడిన విషయాలలో ముఖ్యమైన, ఆ వేదాలతో పోల్చదగిన సాగరాలు, ఆ వేదాలలో ప్రస్తావింపబడిన ద్వీపాలు, లోకాలు, దిక్కులు– అనే వీనిని అన్నిటిని ప్రస్తావించి, "ఇవి అన్నీ నీకు మంగళాన్ని కలిగించు గాక! "అని అంటున్నది.

ఇక్కడ కౌసల్య పలికిన మంగళాశాసన వచనాలలో వేదానికి సంబంధించిన ఏమేమి విశేషాలు గోచరిస్తున్నాయో కొంచెం గమనిద్దాం.

1) వీటిలో మొట్టమొదటి విషయం ఏమంటే, –"వేదం రక్షిస్తుంది" –అనేది. "వేదో రక్షతి రక్షితః" అనేది ఒక సూక్తి. వేదం మనలను రక్షిస్తుంది, ఆ వేదాన్ని మనం రక్షించాలి. నిత్యమైన వేదాన్ని మనం రక్షించడం అంటే ఏమిటి? అది ఏ విధంగా? ? అంటే, వేదం అదృశ్యం కాకుండా, వేదానికి విరూపం రాకుండా, వేదం అయోగ్యుల వద్దకు చేరకుండా, –ఈ విధంగా పలు విధాలుగా

వేదాలను మనం రక్షించాలి. ఇక వేదం మనలను ఏ విధంగా రక్షిస్తుంది? అంటే, మనకు మంచి బుద్ధిని కలిగించి, మంచి ప్రయోజనాలను ఇచ్చి, పారలౌకిక పరమార్థాలను తెలియజేపి, మనలను చక్కగా కాపాడుతుంది.

2) ఈ సూక్తి లో శ్రుతి శబ్దం తరువాత, స్మృతి, ధర్మం –అనే రెండు పదాలు ప్రయోగింపబడ్డాయి. ఇందులో పరమార్థం ఏమంటే –వేదాన్ని అనుసరించే స్మృతి, ఆ విధంగానే ధర్మం అనేవి ఉంటాయి అనేది.

3) తరువాత మూడవ విషయం ఏమంటే, కౌసల్య చేసిన మంగళా శాసనంలో "వేదాలు నీకు మంగళం కలిగించాలి" అని ఉన్నందున వేదాలు మంగళాన్ని కలిగిస్తాయి, అన్ని విధాలయిన శుభాలను చేకూరుస్తాయి –అని తెలుస్తున్నది.

4) శ్రీరాముడు వనవాసానికి ప్రయాణం ఆరంభించే సమయంలో కౌసల్య "వేదం నీకు మంగళం కలిగించాలి" అని చెప్పినందున, ప్రయాణ సమయంలో వేదానుసంధానం అనేది శుభాన్ని చేకూరుస్తుంది– అని తెలుస్తున్నది. ఈనాటికీ మన పెద్దలు ప్రయాణం చేసేటప్పుడు వేద సూక్తులను అనుసంధానం చేయడం అనేది సత్సంప్రదాయంగా వస్తున్నది. యాత్రాదుల కోసం ప్రయాణాలను చేసేటప్పుడు వేదంలో ఉండే స్వస్తివాచనం అనే మంగళ శాసనభాగాన్ని అనుసంధానం చేసి, ప్రయాణాలు ఆరంభించడం అనేది వైదికమైన సంప్రదాయం– అని కూడా తెలుస్తున్నది.

మనం కూడా ఇటువంటి సత్ సంప్రదాయాన్ని ఆచరించి కాపాడుకుందాం.

ఈ విధంగా తన తల్లి అయిన కౌసల్య అనుమతిని పొందిన తరువాత ఆమె భవనం నుండి బయలుదేరిన శ్రీరాముడు తన భవనానికి వచ్చాడు. తరువాత శ్రీరామునితో పాటు సీతాదేవి లక్ష్మణుడు కూడా వనవాసానికి వెళ్లాలనే నిర్ణయం జరిగింది. అప్పుడు శ్రీరాముడు తమ భవనంలో ఉండే అన్ని వస్తువులను తగిన వ్యక్తులకు, ఆవశ్యకత కలిగిన వ్యక్తులకు దానం చేయమని లక్ష్మణునితో చెప్పే సందర్భం ఇది. ఆ విధంగా దానం చేసే సమయంలో ఏ ఏ వస్తువును ఎవరికి ఇవ్వాలి అని వివరించేటప్పుడు శ్రీరాముడు

"ఆచార్యః తైత్తిరీయాణామ్ అభిరూపశ్చ వేదవిత్,
తస్య యానం చ దాసీశ్చ సౌమిత్రే! సంప్రదాపయ"

ఏదైనా ఒక దానాన్ని ఇవ్వాలని అభిప్రాయం ఉన్నప్పుడు ఆ దానాన్ని తగిన వ్యక్తికి ఇవ్వాలనే ధర్మాన్ని వాల్మీకి పలుమార్లు తెలియజేశారు, వ్యాసులు కూడా పలుమార్లు తెలియజేశారు. వేదాన్ని అధ్యయనం చేసిన మహనీయులకు దానం ఇవ్వడం శ్రేష్ఠమని వాల్మీకి ఇక్కడ తెలియజేస్తున్నారు. వేదాలలో ఎన్నో శాఖలు ఉన్నాయి. "ఆచార్యః తైత్తిరీయాణామ్" – వేదంలో ఎన్నో శాఖలు ఉన్నాయి. వాటిలో తైత్తిరీయ శాఖ ఒకటి. అది కృష్ణ యజుర్వేదానికి సంబంధించినది. ఈనాటికి పలువురు అధ్యయనం చేసే శాఖ ఈ శాఖయే. మిగిలిన శాఖలను చాలా తక్కువ మంది అధ్యయనం చేస్తున్నారు. శ్రీరాముని కుటుంబానికి కులగురువు వశిష్ఠులే అయినప్పటికీ తన వేద శాఖ అయిన, తైత్తిరీయ వేదశాఖను శ్రీరామునకు బోధించిన ఆచార్యులు కూడా

ఉన్నారు. "ఆచార్యః తైత్తిరీయాణామ్" అనే సూక్తి వల్ల ఈ విషయం తెలుస్తున్నది. ఈ ఆచార్యులు వేదవిధులే కాదు చూడడానికి చాలా అందంగా ఉన్నారు. "తస్య యానం చ దాసీశ్చ సౌమిత్రే! సంప్రదాపయ" – లక్ష్మణా! ఈ ఆచార్యులకు వాహనాలను, దాసదాసీ జనాన్ని దానం ఇయ్యి– అని శ్రీరాముడు లక్ష్మణునితో అంటున్నాడు. అంటే, తన ఇంటిలో ఉండే వాహనాలను దాసీ జనాన్ని ఆ వేదాచార్యుల నీటిలో ఉండేటట్లు చేయమని శ్రీరాముడు లక్ష్మణునితో అన్నాడు. ఈ సందర్భంలో మనకు స్పష్టమయ్యే కొన్ని విషయాలు ఏమంటే–

వేదంలో పలు శాఖలు ఉన్నాయి. వారు వారు తమకు తమకు చెందిన శాఖలను అధ్యయనం చేయాలి. శ్రీరాముని వేదశాఖ తైత్తిరీయ శాఖ.

విద్య, ఆభిరూప్యం –అనేవి రెండు ఒకే వ్యక్తిలో ఉండడం చాలా అరుదు. అయితే శ్రీరాముని ఆచార్యునిలో ఈ రెండు విశేషంగా ప్రకాశిస్తున్నాయి. శ్రీరాముని ఆచార్యులు వేద విద్వాంసులు గాను, చాలా అందమైనవారుగాను ప్రకాశిస్తున్నారు. వేదవిద్యను అభ్యసించిన వాని ముఖంలో ఒక విలక్షణమైన బ్రహ్మ తేజస్సు ప్రకాశిస్తుంది. వేదమే స్వయంగా "తేజస్వీ యశస్వీ బ్రహ్మవర్చసీ" అనే ఒక మంత్రంలో వేదాన్ని అధ్యయనం చేసినవారు తేజస్సును కలిగినవారుగాను, కీర్తిని కలిగిన వారుగాను, బ్రహ్మ వర్చస్సును కలిగినవారుగాను అవతారని తెలియజేస్తున్నది. వేద విద్య ఒకనికి ఇటువంటి విలక్షణమైన వ్యక్తిత్వాన్ని ప్రసాదిస్తుంది. ఈ విషయాన్ని వేదమే పలుచోట్ల తెలిసి తెలియజేసింది. ఒకరు తన కుమారుని వేద విద్యను అభ్యసించడం కోసం ఆచార్యుని దగ్గరకు పంపించారు. వేదాన్ని

అధ్యయనం చేసి తిరిగి వచ్చిన తన కుమారుని చూచి "సౌమ్య" అనే సంబోధిస్తూ అతడు "కుమారా! ఏమి నీ ముఖంలో విశేషంగా ఒక తేజస్సు ప్రకాశిస్తున్నదే. నీకు నీ ఆచార్యులు బ్రహ్మ జ్ఞానాన్ని అనుగ్రహించార ఏమి తిరిగి రావే! " అని అన్నాడు. అంటే, తన కుమారుని ముఖం చూడగానే, అతని తండ్రికి ఏ విధంగా తన కుమారుడు చక్కగా వేదాధ్యయనం చేశాడు –అనే విషయాన్ని అతని ముఖంలో ఉండే తేజస్సును చూసి గుర్తించాడు అన్నమాట. శ్రీరామునకు తైత్తిరీయ శాఖను బోధించిన ఆచార్యులకు వారు అధ్యయనం చేసినప్పుడు కలిగిన శ్రమ వల్ల, వారు పొందిన వేదవిద్యలోని వైలక్ష్యణ్యం వల్ల, వారు సంపాదించిన బ్రహ్మ జ్ఞానం వల్ల జవారి ముఖంలో ఒక విలక్షణమైన కాంతి ఏర్పడినదని తెలుస్తున్నది.

మూడవ విషయం ఏమంటే –వేదవిత్తులకు దానం చేయడం శ్రేష్ఠం– అనేది. వేద విజ్ఞానాన్ని కలిగిన మహనీయులు ఏనాడో ధనం కోసం ఆశపడరు. ధనాన్ని దృష్టిలో పెట్టుకొని వేదాన్ని అధ్యయనం చేయరు. తమ వద్ద ఉండే వేద విద్యను ఇతరులకు నేర్పించే సమయం లో కూడా ధనాన్ని ఆశించి నేర్పించారు ఉచితంగానే ఆ విద్యను హృదయపూర్వకంగా ప్రదానం చేస్తారు అయితే ఈ వేదవిద్వాంసులు ధనాన్ని ఆశపడకపోయినాప్పటికీ, తమకు ఇతరులు ఇచ్చిన దానాలను స్వీకరిస్తారు. షట్కర్మ నిరతులైన బ్రాహ్మణులకు తాము దానాన్ని ఇవ్వడం, ఇతరులు ఇచ్చిన దానాన్ని ప్రతి గ్రహించడం కూడా కర్తవ్యమే. ధనాన్ని ఆశించని ఈ వేదవిద్వాంసులు ఇతరులు ఇచ్చిన ధనాన్ని ఎందుకు స్వీకరిస్తారు?అంటే, దానాన్ని ఇవ్వడం వల్ల ఇచ్చే వారి దగ్గర ఉండే పాపాలు నశిస్తాయి. స్వయంగా వీరి పాపాలను పోగొట్టడం వేదవిద్వాంసులకు సాధ్యం కాదు కానీ, వీరు ఇచ్చిన

దానాలను స్వీకరించడం ద్వారా వీరి పాపాలు కొన్ని ఇంతవరకు తొలగిపోతాయి కనుక, ఇతరుల పాపాలను నశించటానికి కారణమైన దానాలను వీరు ఉపకార బుద్ధితో స్వీకరిస్తారు. యోగ్యులైన వేద విద్వాంసులకు దానం చేస్తే పాపాలు తొలగిపోతాయి –అని శాస్త్రం చెబుతున్నది. అందుచేత, ఇతరుల పాపాలు తొలగి పోవడానికి దానం కారణం అవుతున్నది, కనుక, వేద విద్వాంసులు సద్బుద్ధితో ఇతరులు చేసిన దానాలను స్వీకరిస్తారు. దానాలను స్వీకరించడం ద్వారా దానం ఇచ్చేవారి దగ్గర ఉండే పాపాలు దానం తీసుకున్నవారి దగ్గరకు చేరుతాయి– అని శాస్త్రం తెలిపినప్పటికీ కూడా, ఇతరులనుండి దానాన్ని స్వీకరించడం దానం ఇచ్చేవారికి ఉపకారం అవుతుందనే బుద్ధితో వేదవిత్తులు దానాన్ని స్వీకరిస్తారు. తమ దగ్గరకు వచ్చి చేరిన ఆ పాపాలను తీర్చుకోగలిగిన శక్తి వేదవిద్వాంసులకు ఉన్నది. వేదాన్ని అధ్యయనం చేయడం ద్వారా తమ దగ్గరకు వచ్చి చేరిన పాపాలను వారు తీర్చుకోగలరు. ఈ విధంగా వేద విద్వాంసులకు దానం చేయడం వల్ల దానం చేసినవారి దగ్గర ఉండే పాపాలు పోతున్నాయి, ఆదానాన్ని స్వీకరించినవారు తమ దగ్గరకు చేరిన పాపాలను కూడా, వేదాన్ని అధ్యయనం చేయడం ద్వారా పోగొట్టుకుంటున్నారు. ఎవడు వేదంలో పరిపూర్ణమైన నిష్ఠను పొందకుండా, తనకు సంక్రమించిన పాపాన్ని అధ్యయనం ద్వారా పోగొట్టుకునే శక్తి లేనివాడై ఉన్నాడో, అతడు ఇతరుల దగ్గర నుండి దానాన్ని స్వీకరిస్తే, అతనిని స్మృతి చాలా నిందిస్తున్నది. ఇంతకుముందే సముద్రంలో మునిగిపోయే ఒకడు ఇతరులు ఇచ్చిన దానాన్ని స్వీకరించడం ద్వారా, తన నడుముకు ఇంకొక బరువును కట్టుకున్నవాడు అవుతున్నాడు అని అంటున్నది. దీనివల్ల మనం గ్రహించవలసినది ఏమంటే, ఒకరి దగ్గర నుండి మనం దానాన్ని స్వీకరించేటప్పుడు, మన యోగ్యత

ఎటువంటిది ? మనకు దానాన్ని స్వీకరించే యోగ్యత మన దగ్గర ఉన్నదా? లేదా? అనే విషయాన్ని మనం జాగ్రత్తగా గమనించుకోవాలి– అని. ఒకరి దగ్గర నుండి మనం దానం స్వీకరించినప్పుడు, వారి దగ్గర నుండి మన దగ్గరకు చేరే పాపాలను మనం పోగొట్టుకోగలమా? దానికి తగినట్లుగా వేదాన్ని పారాయణను చేయడం కానీ, జపాన్ని చేయడం మొదలైన ప్రయత్నాలను చేయడం కానీ మనకు సాధ్యమవుతుందా? అనే విషయాన్ని మనం జాగ్రత్తగా గమనించుకోవాలి. అందుచేత వేద విత్తులకు దానం చేయడం చాలా శ్రేష్ఠమైనది.

మరొక్క విషయం, ఇక్కడ గమనించవలసినది ఏమంటే, వేద విద్వాంసులలో కూడా, వేదాన్ని అధ్యయనం చేయడమే కాక, వేదాన్ని అధ్యాపనం చేసేవారు కొందరు ఉంటారు. వారి యొక్క యోగ్యత విలక్షణమైనది. అటువంటివారికి దానం చేయడం చాలా శ్రేష్ఠం. బ్రాహ్మణులకు విధింపబడిన ఆరు కర్మలలో, వేదాన్ని అధ్యయనం చేయడం, వేదాన్ని అధ్యాపనం చేయడం కూడా రెండు ముఖ్యమైన విధులు. ఈ రెండు విధులను నిర్వర్తించేవారికి దానం చేయడం ఉత్తమం. ఎందుకంటే, వారు వేదాన్ని ధనాన్ని ఆశించి నేర్పించరు. కేవలం ఉచితంగానే నేర్పిస్తారు.

శ్రీరాముడు లక్ష్మణునితో చెప్పే మాటలను కొనసాగిస్తున్నాడు, ఈ క్రింది విధంగా–

ఏ చేమే కఠకాలాపాః బహవో దండమాణవాః,
నిత్యం స్వాధ్యాయశీలత్వాత్ నాన్యత్ కుర్వంతి కించన,

అలసాః స్వాదుకామాశ్చ మహతాం చాపి సమ్మతాః"

ఇదిగో! ఎదురుగా కనిపిస్తున్నారే! వేద బ్రహ్మచారులు, వారిని అందరిని లోపలకు ఆహ్వానించు. వీరు నిత్యం అంతఃపురంలో సాధ్యాయమైన వేదాన్ని అధ్యయనం చేసే స్వభావాన్ని కలిగినవారు. వీరిలో కొందరు కఠులు, కొందరు కాలాపులు. కఠుడు నేర్పించిన కఠశాఖను అధ్యయనం చేసేవారు కఠులు. కళావతి అనే మహర్షి నేర్పించిన కాలాపశాఖను అధ్యయనం చేసేవారు కాలాపులు. ఈ విధంగా వేద సాక్షాత్కారాన్ని చేసిన మహర్షులు దర్శించి నేర్పించిన వేదశాఖలను అధ్యయనం చేసే వేద బ్రహ్మచారులు వీరు. అందరూ అన్ని వేదశాఖలను నేర్వలేరు కదా. కొందరు కఠశాఖను అధ్యయనం చేసినవారు, మరి కొందరు కాలాపశాఖను అధ్యయనం చేసినవారు. ఇటువంటి వారు పలువురు బ్రహ్మచారులు ఉన్నారు. వీరంతా చేతిలో మోదుగ దండాన్ని ధరించి ఉన్నారు. తమ తమ వేదశాఖలను అధ్యయనం చేసిన ఈ బ్రహ్మచారులు, బ్రహ్మచారులు ఏ రూపంలో ఎటువంటి వేషాన్ని కలిగినవారై ఉండాలని వేదంలో చెప్పబడిందో, అటువంటి వేషాన్ని ధరించినవారై ఉన్నారు. చేతిలో పాలాశదండాన్ని ధరించారు. శరీరాన్ని కృష్ణాజినంతో ఆచ్ఛాదించుకున్నారు. మవీరు ఏమేమి కార్యాలను చేస్తున్నారు? అంటే, నిత్యం వేదాధ్యయనాన్ని చేస్తున్నందున వేరొక ఏ విధమైన కర్మను చేసేవారు కాదు. "నిత్యం స్వాధ్యాయశీలత్వాత్ నాన్యత్ కుర్వంతి కించన". అందుచేత తమ ఉదరపోషణం కోసం కూడా ఏ ప్రయత్నం చేయని సోమరుల వంటివారు, వీరు. వీరు చేసే పని కేవలం వేదాధ్యయనం మాత్రమే.

ఇక్కడ శ్రీరాముడు వినోదంగా, హాస్యరసాత్మకంగా ఈ బ్రహ్మచారులను గూర్చి పలుకుతున్నట్లు మనకు తోస్తున్నది. ఈ బ్రహ్మచారులు అలసులు, అంటే, సోమరివారు, అయినా, "స్వాదుకామాశ్చ"– రుచిగా భుజంసాలని కోరిక కలిగినవారు. ఈ విధంగా సోమరిపోతులై, రుచికరమైన భోజనాన్ని అపేక్షించేవారు, అయినా, "మహతాం చాపి సమ్మతాః"– వీరు గొప్పవారికి చాలా ఇష్టమైనవారు. స్వాధ్యాయాన్ని మాత్రమే కర్తవ్యంగా తలచి, ఇక దేనిని భావించకుండా, తమ స్వార్థం కోసం కూడా ఏ విధమైన ప్రయత్నం చేయకుండా ఉన్నవారు కనుక, వీరు గొప్పవారికి చాలా ఇష్టమైనవారు. " బ్రహ్మచారులు ఈ విధంగా స్వాధ్యాయాన్ని తప్ప, ఇక వేరు దేనిని గూర్చి భావించని సోమరిపోతులైనా కానీ, రుచికరమైన భోజనాన్ని అపేక్షించేవారైనా కానీ. వీరు జగత్కళ్యాణం కోసం ఎల్లప్పుడూ వేదాన్ని అధ్యయనం చేసేవారై, లోకక్షేమం కోసం పాటుపడేవారు కనుక, వీరు సోమరిపోతులైనా, రుచికరమైన భోజనాన్ని కోరేవారైనా, వీరు గొప్పవారికి మిక్కిలి ఇష్టమైనవారే "" అని అంటున్నాడు శ్రీరాముడు.

భరద్వాజమహర్షి "అనడ్వానాహితాగ్నిశ్చ బ్రహ్మచారీ చ భారత! ఈ ముగ్గురూ ఎల్లప్పుడూ భోజనం చేస్తూ ఉన్నప్పటికీ కూడా, ఏ దోషం లేదు– అని అన్నాడు. వారు ముగ్గురు ఎవరంటే, బండి ఎద్దు, ఆహితాగ్ని, బ్రహ్మచారి –అనేవారు.

ఇక్కడ వీరి ముగ్గురిని గురించిన ప్రస్తావన ఎందుకంటే,

బండి ఎద్దు బండిని లాగడం కోసం ఎంత శ్రమ పడుతున్నది! ఎంత కష్టపడుతున్నది! అది ఎక్కువ గడ్డి తింటుందని కానీ, ఎక్కువ తిండి తింటుందని కానీ మనం భావిస్తామా! "అది పడే కష్టానికి అది తినే తిండి చాలా తక్కువ"– అని కదా తలుస్తాము. ఆ విధంగానే ఆహితాగ్ని కూడా నిత్యం మూడు అగ్నులను ప్రతిదినం భక్తితో ఆరాధించి, ఒక కళ్యాణం కోసం పాటుపడేవాడు. అతడు ఒక సమయంలో అధికంగా మూడుసార్లు భుజించినా తప్పు లేదు.

ఆ విధంగానే, బ్రహ్మచారి కూడా అందరి క్షేమం కోసం పాటుపడేవాడు. నిరంతరం వేదాన్ని అధ్యయనం చేస్తూ, లోక క్షేమం కోసం, మన అందరి క్షేమంకోసం ప్రయత్నం చేసేవాడు కనుక, అతడు సోమరిపోతు అయినా, రుచి రుచిగా భోజనాన్ని అపేక్షించేవాడైనా, తప్పు లేదు. అతడు మహనీయులకు మిక్కిలి ఇష్టమైనవాడు – అని అన్నాడు. శ్రీరాముడు.

"లక్ష్మణా! అటువంటి మహనీయులైన బ్రహ్మచారులను నీవు అంతఃపురంలోనికి సగౌరవంగా ఆహ్వానించి, 80 బండ్ల నిండా రత్నాలను నింపి, ఒక్కొక్క బ్రహ్మచారికి ఒక్కొక్క బండి చొప్పున, వీరికి దానం చేయి" అని అన్నాడు, శ్రీరాముడు. దీనిని బట్టి అక్కడ 80 మంది బ్రహ్మచారులు ఉన్నట్లు తెలుస్తున్నది. తరువాత శ్రీరాములడు లక్ష్మణునితో అంటున్నాడు, ఈ విధంగా.

"అంబా యథా నో నందేచ్చ కౌసల్యా మమ దక్షిణామ్"

ఇక్కడ ముఖ్యంగా ఇది గమనించవలసిన విషయం. బ్రాహ్మణులకు, అందులోనూ, వేదం అధ్యయనం చేసే

బ్రాహ్మణులకు, అందులోనూ, వేరు ఏ కార్యాన్ని చేయకుండా, వేదాన్ని మాత్రం అధ్యయనం చేయడమే కర్తవ్యంగా కలిగిన బ్రాహ్మణులకు దానం చేయమని శ్రీరాముడు లక్ష్మణునితో అంటున్నాడంటే, దానికి కారణాన్ని కూడా శ్రీరాముడే సూచిస్తున్నాడు. "ఈ విధంగా నేను వైదికులైన బ్రాహ్మణులకు దానం చేసినప్పుడే నా తల్లి కౌసల్య సంతోషిస్తుంది. "అని ఆ కారణాన్ని సూచిస్తున్నాడు. తన తల్లి మనస్సు సంతోష పడడమే శ్రీరామునకు కావలసినది. తాను ఏమి చేస్తే తన తల్లిదండ్రులకు సంతోషం కలుగుతుందో, ఆ పనిని చేసే స్వభావం కలిగినవాడు కదా, శ్రీరాముడు. ఇప్పుడు అరణ్యానికి శ్రీరాముడు వెళ్లడం కూడా తన తండ్రి మాటను అనుసరించే కదా. తన తండ్రి సత్యసంధుడు– అనే మాటను నిలబెట్టడం కోసమే కదా. ఆ విధంగానే. ఇప్పుడు వేదనిష్ఠులైన బ్రాహ్మణులకు దానం చేయడం కూడా తన తల్లి మనస్సును సంతోష పెట్టడం కోసమే. అందువల్ల, " ఏ విధంగా దానం చేస్తే, నా తల్లి సంతోషపడుతుందో, ఆ విధంగా నీవు బ్రాహ్మణులకు దానం చేయి. తైత్తిరీయ శాఖకు చెందిన ఆచార్యులకు, కాఠకులకు, కాలాపకులకు, నిత్యం అధ్యయనం చేసే బ్రాహ్మణులకు, వైదిక దండబ్రహ్మచారులకు నీవు నా తల్లి మనస్సు సంతోషపడేటట్లుగా దానం చేయాలి" అని అంటున్నాడు, శ్రీరాముడు.

ఈ సందర్భంలో మనకు గమనించవలసిన విషయాలు ఏమంటే–
1) మన పెద్దలు ఆచరించిన క్రమాన్ని మనం అనుసరించి, దానిని ఆచరించాలి. అప్పుడే మన తర్వాతి తరం వారి కూడా మనను అనుసరించి ఆ క్రమాన్ని ఆచరిస్తారు. తల్లి, తండ్రి ఏ విధమైన

ధర్మాన్ని, ఏ విధంగా ఆచరిస్తారో, వారి సంతానం కూడా ఆ విధంగానే, ఆ ధర్మాన్ని అనుసరించి ప్రవర్తిస్తారు. అందువల్ల తల్లిదండ్రులు కూడా తరువాతి తరం వారికి ఉదాహరణప్రాయంగా నిలచి, సర్ధర్మాన్ని అనుష్ఠించాలి. దానివల్ల తరువాత తరంవారినికూడా మంచి మార్గంలో పెట్టగలిగిన వారవుతారు. వారిని సంస్కారవంతులుగా చేయగలుగుతారు. వారికి హితాన్ని కలిగించినవారు అవుతారు. అందువల్ల, వేద విద్వాంసులను మనం ఆదరించినట్లయితే, మన తరువాతి తరంవారు కూడా ఆ విధంగానే వేదవిద్వాంసులను ఆదరించే స్వభావాన్ని, అలవాటును కలవారు అవుతారు. దీనివల్ల మన వైదిక సంప్రదాయం పరిరక్షింపబడటమే గాక, లోక క్షేమం కూడా సిద్ధిస్తుంది. తన తల్లి వేద పండితులను ఆదరించడం వల్లనే కదా, శ్రీరాముడు కూడా వేద పండితులను సత్కరించమని లక్ష్మణునితో అన్నాడు.

ఇక్కడ ఈ సందర్భంలో మనం గమనించవలసిన కొన్ని విషయాలు ఉన్నాయి. అవి ఏమి అంటే,

1) వైదిక బ్రహ్మచారులలో, వారు అధ్యయనం చేసే శాఖలను అనుసరించి వారిలో పలు విధాలైన విభాగాలు ఉన్నాయి. పైన ఉదాహరించిన శ్రీరామాయణ సూక్తిలో కఠకాలాపశాఖలు ప్రస్తావింపబడ్డాయి కదా

2) వైదిక బ్రహ్మచారులు తమ చేతులలో మోదుగ దండాన్ని ధరించి ఉన్నారు. ఇది కూడా ఒక వేద విధి. ఈ నాటికీ ఈ వేదవిధిని బ్రహ్మచారులు అనుసరించడం చూస్తున్నాం. శ్రావణ పూర్ణిమనాడు అధ్యయన ప్రారంభం సమయంలో బ్రహ్మచారులు అంతకుముందు తాము ధరించే పాత పలాశ దండాన్ని విడచిపెట్టి,

కొత్త దండాన్ని దానికి నిర్దేశింపబడిన మంత్రాన్ని అనుసంధానం చేస్తూ ధరించడం అనేది వైదికమైన విధి.

3) సార్వకాలికవిధిగా వేదాన్ని బ్రహ్మచారులు అధ్యయనం చేస్తున్నారు. కొంత సమయం లౌకిక కార్యాలను ఆచరిస్తూ, మిగిలిన సమయాలలో మాత్రం వేదపారాయణం చేసేవారు కొందరు బ్రహ్మచారులు ఉండవచ్చు. కానీ ఆ విధంగా కాకుండా, ఈ బ్రహ్మచారులు అనవరతం వేదాధ్యయనాన్ని చేస్తున్నారు. గోదాదేవి కూడా "వేదవాయ్ త్తొళిలార్కళ్ వాళ్" అని అన్నది. అంటే, వేదాన్ని అధ్యయనం చేయడమే నిత్య కృత్యంగా కలిగినవారు. ఏదో ఒక సమయంలో మాత్రం వేదాన్ని అధ్యయనం చేయడం కాకుండా, సర్వదా వేదాన్ని అధ్యయనం చేయడమే స్వభావంగా కలిగినవారు –అని ఈ సూక్తి లోని భావం. ఇటువంటి బ్రహ్మచారులే శ్రీరామాయణ కాలంలో ఉన్నట్లు మనకు శ్రీముని పై సూక్తివల్ల స్పష్టమవుతున్నది.

4) బ్రహ్మచారులు తమ ఉదర పోషణం కోసం ఏ విధమైన ప్రయత్నం చేయనప్పుడు వారికి ఈ విధంగా శరీర పోషణ సాధ్యమవుతుంది? అని అంటే, బ్రహ్మచారులకు ధనాన్ని సంపాదించడమో, లేక, లౌకికమైన కార్యాలను చేయడమో కర్తవ్యం కాదు కనుక, వారు తమ శరీరాన్ని పోషించుకోవడం కోసం భిక్షను సంపాదించవలసి ఉన్నది. భిక్షద్వారా తమ శరీరాన్ని బ్రహ్మచారులు పోషించుకోవాలి. " భవతి! భిక్షాం దేహి" అని భిక్షను యాచించి, తమ శరీర పోషణను చేసుకోవాలి.

5)వారి విషయంలో ఏదైనా ఒక కొరతను చెప్పాలి –అని అనుకుంటే, వారిని ఏ పని చేయని అలసులు– అని అనవచ్చు, లేక, రుచికరమైన ఆహారాన్ని భుజించాలని ఆశపడేవారు– అని అనవచ్చు, అంతే. అయితే, వీనిని పెద్దలు కొరతలుగా భావించరు. అంతే కాదు. "అనడ్వానాహితాగ్నిశ్చ బ్రహ్మచారీ చ" అని మహర్షి చెప్పినట్లుగా వారు ఆ విధంగానే ఉండాలి, ఉండి తీరాలి– అని వారు భావిస్తారు.

అందువల్ల–

మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముడు అనుసరించిన వైదికమైన ధర్మాన్ని మనం కూడా అనుసరిస్తూ, వేద పండితులను, వైదిక బ్రహ్మచారులను ఆదరించి, వారికి సహాయ పడదాం.

వేదాన్ని, వైదిక సంప్రదాయాన్ని కాపాడుదాం.

మన తల్లిదండ్రులు ఆచరించిన సద్ధర్మాన్ని మనం కూడా ఆచరించి, మన తరువాత తరంవారికి ఆ వైదికమైన సంస్కారాన్ని అందజేద్దాం.

ఇది మన విధి. ఇది మన కర్తవ్యం. ఇది మన జాతిపురోగతికి మూలకారణం.

ఇంతవరకు వాల్మీకి రామాయణంలో బాలకాండలో, అయోధ్యకాండలో మనకు గోచరించే వేద మహిమను గూర్చి సంగ్రహంగా గమనించాం. ఇక, ఇప్పుడు అరణ్యకాండలో మనకు కనిపించే వేద మహిమ ప్రస్తావనను గమనిద్దాం.

రావణుడు మాయా మృగంగా మారిన మారీచుని సహాయంతో రామలక్ష్మణులను వంచించి, సీతాదేవిని శ్రీ రాముని నుండి వేరు చేసి, ఆమెను అపహరించుకుని పోయాడు. శ్రీరామునితో నేరుగా

నిలచి యుద్ధం చేయలేక, దొంగతనంగా. పిరికిపంద వలె ఆమెను అతడు అపహరించుకొని పోయాడు. జటాయువు అనే పక్షిరాజు దశరథునకు స్నేహితుడు. సీతను రావణుడు అపహరించుకొని పోవడం అతడు గమనించాడు. ఆమెను ఆ విధంగా రావణుడు తీసుకొని పోకుండా అడ్డుపడి ఆమెను రక్షించాలని, రామచంద్రునకు సహాయ పడాలని, అది తన కర్తవ్యం అని భావించిన జటాయువు రావణుని జయించడం తనకు సాధ్యం కాని పని –అనే సంగతి పూర్తిగా తెలిసినప్పటికీ, అతనిని ఎదుర్కొన్నాడు. ఎందుకంటే అది తన ప్రాణాన్ని పణంగా పెట్టి అయినా, భగవంతుడైన శ్రీరామచంద్రునకు చేయవలసిన కైంకర్యమని అతడు భావించాడు సీతను తీసుకొని పోయే రావణుని చూచి అతడు విధంగా అంటున్నాడు.

"న శక్తః త్వం బలాత్ హర్తుం వైదేహీం మమ పశ్యతః,
హేతుభిః న్యాయసంయుక్తైః ధ్రువాం వేదశ్రుతీమివ"

"రావణా! నేను చూస్తూ ఉండగా, నీవు సీతాదేవిని అపహరించడం సాధ్యం కాని పని. నీకు ఆ శక్తి లేదు. "

ఈ విధంగా పలికే జటాయువు తాను చెప్పిన మాటను ఒక ఉపమానంతో సమర్ధిస్తున్నది. ఏవిధంగా అంటే–
"హేతుభిః న్యాయసంయుక్తైః ధ్రువాం వేదశ్రుతీమివ" అని.
"యుక్తులతో, అంటే, తగని, తర్కాలతో న్యాయాలతో వేదార్థాన్ని విరుద్ధంగా, బలాత్కారంగా చెప్పడానికి వీలు లేని విధంగా, నీవు,

నేను చూస్తూ ఉండగా, సీతనుఅపహరించలేవు" అని జటాయువు అంటున్నది.

ఈ జటాయువు వాక్యాన్ని బట్టి సీతాదేవి, వేద శ్రుతి – అనే రెండు సమానమని ఏర్పడుతున్నది. వేదశ్రుతిని ఏ విధంగా బలాత్కారంగా వేదవిత్తు సమక్షంలో అపహరించడం సాధ్యం కాదో, ఆ విధంగానే, సీతాదేవిని బలాత్కారంగా నా ముందు అపహరించడం సాధ్యం కాదు –అని జటాయువు పలికిన ఈ ఉపమానంలోని తాత్పర్యం. ఇందువల్ల సీతాదేవి శ్రుతి వంటిది అనే సామ్యంతోపాటు, జటాయువు వేదవిత్తువంటివి అని కూడా తెలుస్తున్నది. జటాయువు వేదార్థాన్ని చక్కగా తెలిసినవానివలె, రావణుడు ఆ వేదార్థాన్ని బలాత్కారంగా మార్చి అపహరించి, వేరే విధంగా చెప్పాలని అనుకునేవారి లె ఉన్నారు అనేది పరమార్థం.

రావణుడు సీతను అపహరించడాన్ని చూస్తే జటాయువునకు ఏమని తోస్తున్నది? అంటే–

కొందరు వేదార్థాన్ని బలాత్కారంగా మార్చడానికి ప్రయత్నం చేస్తారు వారిలో రెండు విధాలవారు ఉన్నారు వారిలో ఒక వర్గంవారు వేదాన్ని పూర్తిగా అనాదరించేవారు. వీరు వేదాన్ని అసలు ప్రమాణంగానే అంగీకరించరు. వీరికి వేదబాహ్యులు అని పేరు. వేరొక వర్గం వారు వేదాన్ని ప్రమాణంగా అంగీకరించినప్పటికీ, ఆ వేదానికి తగిన విధంగా అర్థాన్ని చెప్పకుండా, బలవంతంగా, వేరు విధంగా వేదానికి అర్థన్ని చెప్పి మార్చాలని చూస్తారు. వీరికి కుదృష్టులు అని పేరు. అనగా, చూపు సరిగా లేనివారు– అని అర్థం. రావణుడు సీతను అపహరించడం – వేదార్థాన్ని అంగీకరించకుండా, వేరు విధంగా మార్చాలని ప్రయత్నం చేసినట్లు జటాయునకు తోచింది. ఈ విధంగా ఉండే బాహ్యులు,

కుదృష్టులు ఎంతగా, ఎన్ని విధాలుగా వేదార్థాన్ని కాదని, వేరే విధంగా చెప్పాలని ప్రయత్నం చేసినప్పటికీ, ఆ పని వారికి సాధ్యం కాకుండా ఉండేటట్లు మహనీయులైన మహర్షులు, ఆళ్వార్లు, భగవద్రామానుజుల వంటి పూర్వాచార్యులు ఎందరో మాటిమాటికి ఆ యా సమయాలలో అవతరించి, వారి ప్రయత్నాలను విఫలం చేసి, శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకాచార్యులై, వేదార్థాన్ని సుప్రతిష్ఠితం చేసినట్లు, రావణుడు ఎంతగా ప్రయత్నం చేసినప్పటికీ జటాయువు ఉండగా సీతాదేవిని అపహరించడం సాధ్యం కాదు– అని జటాయువు వచనంలోని ఆశయం. " వేదార్థాన్ని లేదని, కాదని మార్చాలని ప్రయత్నించే వేద బాహ్య కుదృష్టులతో వాదించి వేదవిత్తు వేదాన్ని వేదార్థాన్ని రక్షించి కాపాడేటట్లే, నేను, వేద బాహ్య కుదృష్టుల వంటి రావణుని జయిస్తాను, శ్రుతివంటి సీతను రక్షిస్తాను" –అని జటాయువు వాక్యంలోని అర్థం.

ఈ సందర్భంగా మనకు గోచరించే అంశాలు ఏమి? అని అంటే,

1) వేద శ్రుతి సీత వంటిది. సీత వేద శ్రుతివంటిది అనే విషయం శ్రీరామాయణంలో ఇంకా పలుచోట్ల చెప్పబడింది. సీత వేదశ్రుతియే.

2)జటాయువు వాక్యంలో వేద శ్రుతికి" ధ్రువా " అనే ఒక విశేషణం ప్రయోగింపబడింది. ధ్రువా అంటే– కదల్చడానికి, మార్చడానికి, కాదనడానికి వీలులేనిది– అని అర్థం. వేదశ్రుతి అటువంటిది. ఆ విధంగానే సీతాదేవి కూడా అటువంటిదే.

3)రాముని పత్ని అయిన సీతాదేవి వేరొకరి దగ్గరకు రానట్లే, వేద శ్రుతి ఏ అపార్థంలోను అన్వయించదు. అయినప్పటికీ, సీతాదేవిని రావణుడు బలాత్కారంగా అపహరించాలని చూచినట్లే, కొంతమంది వేదార్థాన్ని మార్చాలని, దానికి అపార్థం చెప్పాలని చూస్తారు. ఇది తప్పక భయపడవలసినటువంటి విషయం

4). రావణుడు సీతను అపహరించుకుని పోకుండా జటాయువు అడ్డుపడినట్లే, సీతను రక్షించడానికి ప్రయత్నం చేసినట్లే, మనం కూడా వేదార్థాన్ని మార్చాలని చేసే కుయుక్తివాదుల ప్రయత్నాలను అడ్డుకోవాలి. ఆ విధంగా వారు వేదార్థాన్ని మార్చకుండా పరిరక్షించుకోవడానికి ప్రయత్నిం చేయాలి. అది మన కర్తవ్యం.

రామచంద్ర మూర్తి నుండి సీతను వేరు చేయాలనే ప్రయత్నం చేసిన రావణుడు చివరకు ఏమయ్యాడు? నశించిపోయాడు. అతని ప్రయత్నం సఫలం కాలేదు కదా. ఆ విధంగానే, వేదార్థాన్ని మార్చాలని ప్రయత్నించేవారు కూడా చివరకు రావణుని వలె నశించిపోతారు. వారి ప్రయత్నం ఎంత మాత్రం సఫలం కాదు.

"హేతుభిః న్యాయసంయుక్తైః ధ్రువాం వేదశ్రుతీమివ" అనే మూడవ పాదానికి కొంతమంది వేరే విధంగా అర్థాన్ని చెబుతున్నారు. తగని కుయుక్తులతో, హేతువులతో, న్యాయాలతో వేదార్థాన్ని మార్చాలని చేసేవారి ప్రయత్నం విఫలం అయ్యేటట్లుగా, సీతను అపహరించాలని రావణుడు చేసే ప్రయత్నం విఫలం అవుతుంది –అనేది జటాయువు వచనంలోని

తాత్పర్యంగా వారు గ్రహిస్తున్నారు. దీనివల్ల వేదార్థాన్ని బలాత్కారంగా మార్చాలని చేసే వారి ప్రయత్నం రావణుని ప్రయత్నం వలె విఫలం అవుతుందని, రావణుడు నశించిపోయినట్లు వారు కూడా నశించిపోతారనే అర్థమే ఇక్కడ కూడా సిద్ధిస్తుంది.

ఇప్పుడు, వాల్మీకి రామాయణంలో కిష్కిందాకాండలో గోచరించే వేద మహిమను తెలియజేసే ఒక సందర్భాన్ని గమనిద్దాం.

శ్రీరామునకు, సుగ్రీవునకు మధ్య స్నేహం ఏర్పడింది. సుగ్రీవుడు శ్రీరామునితో అంటున్నాడు. " నీవు సీతను కోల్పోయావు. రాజ్యాన్ని కోల్పోయావు. అరణ్యానికి వచ్చావు. ఆ విధంగానే, నేను కూడా నా భార్యను, రాజ్యాన్ని కోల్పోయాను, కిష్కింధను వదలి పెట్టి ఈ వనంలో తిరుగుతున్నాను. ఈ విధంగా పలు రీతులలో చూసినప్పుడు, నీవు, నేను సమానంగానే ఉన్నాము. సమానమైన స్థితిలో ఉండే మనకిద్దరకు స్నేహం కుదరడం యుక్తమే. నీకు ఏర్పడిన కష్టాల వంటివే నాకు కూడా ఏర్పడ్డాయి. మనం స్నేహితులుగా కలసి ఉందాం" అని సుగ్రీవుడు అన్నాడు. ఈ సందర్భంలో సుగ్రీవుడు పలికిన మాటలలో వేదమహిమకు సంబంధించిన ప్రస్తావన వచ్చింది.

"అహం తా మానయిష్యామి నష్టాం వేదశ్రుతీ మివ.
రసాతలే వా వర్తంతీ వర్తంతీ వా నభఃస్థలే"

ఈ వాక్యాన్ని సుగ్రీవుడు తెలిసి పలుకుతున్నాడా? లేక, వాల్మీకి స్వయంగా సుగ్రీవుని ద్వారా పలుకుతున్నాడా? ఏ విధంగా అయినప్పటికీ, ఈ సుగ్రీవుని మాటలోని భావం ఇది.

"సీత వేదశ్రుతి వంటిది" అని అంటున్నాడు సుగ్రీవుడు. ఈ మాటనే కదా జటాయువు కూడా చెప్పాడు సుగ్రీవుడు వానరుడైనా, జ్ఞానంలో అల్పజ్ఞుడు అయినా, అదే మాటను చెబుతున్నాడు. ఆశ్చర్యం! వేదం అదృశ్యమైనప్పుడు భగవంతుడు దానిని ఉద్ధరించడం కోసం ఎన్నో అవతారాలను ఎత్తాడు. ఒక పర్యాయం రసాతలంలో ఉండే వేదాన్ని వరాహరూపియై అన్వేషించి, దానిని ఉద్ధరించి తీసుకొని వచ్చాడు. ఇంకొక పర్యాయం, ఆ వేదం ఆకాశంలో అదృశ్యమైనపుడు, మహర్షులు ఎంతో శ్రమపడి తపస్సు చేసి, ఆ వేదాన్ని సాక్షాత్కరించుకున్నారు. వేదమంత్రాలను దర్శించి వాటిని మనకు అనుగ్రహించారు. ఆ విధంగానే, వేద శ్రుతి వంటి సీతాదేవిని నేను, ఆమె రసాతలంలో ఉన్నప్పటికీ, ఆకాశంలో ఉన్నప్పటికీ, ఆమెను రావణుడు ఎక్కడ దాచినప్పటికీ, ఎంత శ్రమ పడి అయినా సరే, అన్వేషించి చూచి, ఆమెను నీ వద్దకు తిరిగి తీసుకొని వస్తాను. –అని అంటున్నాడు, సుగ్రీవుడు.

ఈ సందర్భంలో సుగ్రీవుని ద్వారా వాల్మీకి పలికించిన వచనాల స్వారస్యాన్ని బట్టి, సుగ్రీవుని మాటలలో, " రామా! పరమాత్మవు అయిన నీవు ఎన్నో అవతారాలను ఎత్తి, అదృశ్యమైన వేదాన్ని అన్వేషించి, తిరిగి వచ్చి లోకానికి అందించావు. సరే. ఇప్పుడు వేదశ్రుతి వంటి సీతాదేవి అదృశ్యమైనది. ఆమెను అన్వేషించి తిరిగి సంపాదించడంలో నీకు నేను సహాయపడతాను.

ఆమె వేదం వలె ఆకాశంలో ఉన్నా సరే, రసాతలంలో ఉన్నా సరే, ఆమెను, పూర్వం వేదాన్ని నీవు అన్వేషించి తిరిగి తీసుకొని వచ్చినట్లుగా, అన్వేషించి తిరిగి తీసుకొనిరావడంలో నీకు సహాయపడతాను" అనే భావం వ్యక్తమవుతున్నది.

ఇక్కడ ఈ సుగ్రీవుని వాక్యాల వల్ల మనకు వ్యక్తం అవుతున్న కొన్ని అంశాలు ఏమంటే–
1) సీతాదేవి వేదశ్రుతివంటిది.

2) ఈ ఇద్దరూ కూడా కొన్ని సమయాలలో అదృశ్యం కావడం సంభవించింది. వేదం అదృశ్యమైన వృత్తాంతాలు, దానిని భగవంతుడు తిరిగి తీసుకుని వచ్చిన వృత్తాంతాలు వేదంలో తెలుపబడ్డాయి. వేద సమానమైన రామాయణంలో వేద శ్రుతి వంటి సీతాదేవి అదృశ్యమైన వృత్తాంతం, ఆమెను రామావతారరూపుడైన భగవంతుడు అన్వేషించి తిరిగి సంపాదించిన వృత్తాంతం తెలుపబడింది. ఈ విధంగా వీరిద్దరిని భగవంతుడు అన్వేషించి తిరిగి తీసుకొని రావడం జరిగింది. వేదాన్ని హయగ్రీవ వరాహాది అవతారాలలో భగవంతుడు అన్వేషించి రక్షించిన వృత్తాంతం వైదికం కాగా, శ్రుతివంటి సీతాదేవిని అన్వేషించి రక్షించిన వృత్తాంతం వేదోపబృంహణం అయిన వాల్మీకి రామాయణంలో తెలుపబడింది.

3) ఇక మూడవ విషయం ఏమంటే, పాతాళంలో ఉన్నప్పటికీ ఆకాశంలో మరుగు పడి ఉన్నప్పటికీ, సీతాదేవిని నేను కనుగొని తీసుకొని వస్తాను– అని సుగ్రీవుడు పలికిన మాట వల్ల ఒక విషయం ధ్వనిస్తున్నది. భగవంతుడు వరాహవతారంలో రసాతలంలో

మరగుబడి ఉండే భూమిని, దానితో పాటు వేదాన్ని కూడా ఉద్ధరించి తీసుకొని వచ్చాడు. ఆ విధంగానే, మహర్షులు గొప్ప తపస్సు చేసి, ఆకాశంలో అంతర్హితంగా ఉండే వేదాన్ని ప్రత్యక్షీకరించుకొని లోకానికి అందజేశారు– అనే వృత్తాంతాలు ఇక్కడ ధ్వనిస్తున్నాయి.

4) అంతర్హితమైన వేదాన్ని తిరిగి తీసుకొని రావడానికి సాధ్యమైనట్లే, రావణుడు అపహరించి, దాచి పెట్టిన, వేదశ్రుతి వంటి సీతను కూడా తిరిగి సంపాదించి తీసుకొని రావడం సాధ్యం– అనే విషయం సుగ్రీవుని మాట వల్ల ఇక్కడ సూచింపబడుతున్నది.

ఇక, ఇప్పుడు సుందరకాండలో వేద మహిమను తెలిపే కొన్ని విశేషాలను గమనిద్దాం.

అశోకవనంలో ఉండే సీతాదేవిని చూచి హనుమంతునకు మనస్సులో కలిగిన భావాన్ని తెలియజేస్తూ వాల్మీకి మహర్షి ఈ వచనాలను పలుకుతున్నారు.

"తస్య సందిదిహే బుద్ధిః తథా సీతాం నిరీక్ష్య చ,
ఆమ్నాయనా మయోగేన విద్యాం ప్రశిథాలామివ"

హనుమంతుడు సీతాదేవిని చూస్తున్నా, ఆమెను అతడు ఎంతగా చూసినప్పటికీ, ఆమె సీతాదేవియే– అనే నిశ్చయాన్ని చేసుకోలేకపోయాడు. భర్త అయిన శ్రీరామచంద్రుని విశ్లేషం వల్ల ఎంతో ఆర్తితో దుఃఖంతో శైథిల్యాన్ని పొందిన సీతాదేవి అతనికి శిథిలమైన వేద విద్యవలె తోచిందట. హనుమంతునకు కూడా ఇక్కడ సీతాదేవి వేద శ్రుతి వలెనే తోచింది. అయితే, శిథిలమైన శ్రుతి వలె తోచింది. వేదం కూడా కొన్ని సమయాలలో

శిథిలమవుతుంది. అభ్యాసం లోపించినప్పుడు వేదం శిథిలమవుతుంది. ఆ విధంగా శిథిలమైన వేదమేనా, రామునాకు దూరమై ఈ విధంగా దుఃఖాన్ని పొంది శిథిలమైన సీత దేవి! అని హనుమంతునకు తోచిందట. హనుమంతునకు కూడా సీతాదేవి వేదం వలె తోచినప్పటికీ, ఆమె దుఃఖంతో ఉన్న కారణంచేత శిథిలమైన శ్రుతి వలె కనిపించింది వేదం శిథిలమైన కథ పురాణాలలో ఉన్నది. సీత భర్తృవియోగదుఃఖంతో శిథిలమైన కథ కూడా పురాణాలలో ఉన్నది.

" ఆమ్నాయనా మయోగేన విద్యాం ప్రశిథాలామివ" అనే ఈ ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ గోవిందరాజులు పైన తెలిపిన అర్థాన్ని సూచించడంతోపాటు,"అమ్నాయానామ్ –వేదానామ్, అయోగేన–అసంబంధేన, విద్యాం– వేదబాహ్య విద్యామ్" అనే ఇంకొక వివరణాన్ని కూడా అనుగ్రహించారు. వేదాల సంబంధం లేనందువల్ల శిథిలం అవుతున్న, వేద బాహ్యమతాలకు సంబంధించిన విద్య వలె సీతాదేవి హనుమంతునకు తోచినదని దీని భావం. ఈ రెండు వివరణలో దేనిని గ్రహించినప్పటికీ కూడా, సమంజసమే. ఎందుకంటే, ఈ రెండు వేదవిద్యా వైభవాన్ని, ప్రాధాన్యాన్ని తెలియజేస్తున్నాయి.

లోకంలో ఎన్నో విద్యాస్థానాలు ఉన్నాయి. వాటికి అన్నిటికి వేదంతో సంబంధం ఉన్నది. వేదాంతం, వ్యాకరణం, మీమాంస, ఛందస్సు, ప్రాతిశాఖ్యం మొదలైన విద్యా స్థానాలు అటువంటివి. లోకంలో ఇంకా కొన్ని విద్యా స్థానాలు సంగీతం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన విద్యా స్థానాలు ఉన్నాయి వాటికి వేదంతో అంత

గాఢమైన సంబంధం లేకపోవచ్చు. కానీ బొత్తుగా సంబంధం లేకుండా ఉండదు. ఇటువంటి విద్యా స్థానాలు అన్ని వేదంతో సంబంధం లేకుండా అధ్యయనం చేసినట్లయితే అవి శిథిలమైపోతాయి. స్పష్టంగా భాసించవు. ఆ విధంగానే, అశోకవనంలో ఉండే సీత కూడా హనుమంతునకు గోచరించింది.

ఇక్కడ మనకు ఆశించే గమనించవలసిన కొన్ని అంశాలు ఏమంటే–

1) శ్రీరాముడు వేదంవలె, సీత ఆ వేదంతో సంబంధం లేని విద్య వలె ఉన్నారు.

2) ఏ విద్యకు అయినా స్థైర్యాన్ని, బలాన్ని, సంపూర్ణతను, శోభను చేకూర్చేది వేదమే.

3) సీతకు రామునితో సంబంధం శోభను కలిగించేటట్లు, విద్యకు వేదంతో సంబంధం శోభను కలిగిస్తుంది,

4) వేద సంబంధం లేని విద్య నశించిపోతుంది.

ఈ సందర్భంగానే వాల్మీకి మహర్షి ఇంకొక, వేద మహిమను తెలిపే సూక్తిని కూడా అనుగ్రహించారు. అది ఏమంటే,

" ప్రతిపత్ పాఠశీలస్య విద్యేవ తనుతాంగతా" అనేది.

ఈ సందర్భంలో కూడా సీతాదేవి వేదంవలెనే హనుమంతునకు తోస్తున్నది. అయితే, ఇక్కడ ఏ విధంగా తోస్తున్నట్లు చెప్పబడింది? ప్రథమా తిథినాడు, అంటే, పాడ్యమినాడు అధ్యయనం చేసే అలవాటు కలవానికి ఆ వేదవిద్య ఏ విధంగా అయితే క్రమంగా కృశించి పోతుందో, ఆ విధంగానే,

శ్రీరాముని విశ్లేష దుఃఖం చేత ఈ సీతాదేవి కృశించిపోయి. పాడ్యమి తిథినాడు అధ్యయనం చేయబడిన వేదవిద్యవలె కనిపిస్తున్నది. ఇక్కడ విద్య అంటే వేదం.

ఈ సూక్తి లో ఏమి చెప్పబడింది?

1) పాడ్యమి మొదలైన అనొధ్యయన దినాలలో వేదాన్ని అధ్యయనం చేయకూడదు. ఏ ఏ తిథులలో ఏ ఏ సమయాలలో వేదాన్ని అధ్యయనం చేయవచ్చు అని చెప్పబడిందో ఆయా తిథులలో ఆయా సమయాలలో మాత్రమే వేదాన్ని అధ్యయనం చేయాలి. వ వేదాధ్యయనానికి అధికారి నియమాలు, కాలనియమాలు, దేశ నియమాలు, ప్రకార నియమాలు మొదలైనవి విధింపబడి ఉన్నాయి ఉన్నాయి. వాటిని అనుసరించే అధ్యయనాన్ని చేయాలి. లేకపోతే అది క్రమంగా క్షీణించి పోతుంది.

2) ప్రథమాతిథి అనేది అనధ్యయన దినాలలో మొట్టమొదటిది. ఆ తిథిలో వేదాధ్యయనాన్ని చేయకూడదు. కొంతమంది ఈ నియమాలను లెక్కపెట్టకుండా, మనకు వేద విద్య త్వరగా రావాలి అని ఆశతో వేదాన్ని అధ్యయనం చేస్తారు అటువంటి వారి దగ్గర నుండి పేద విద్య క్రమంగా తొలగిపోతుంది. అది ఏ విధంగా? అంటే, సీత దేవి చాలా ఉన్నతురాలే, శ్రేష్ఠయే. కానీ ఆ సీతయ్యే అశోకవనంలో ఉన్నప్పుడు, చాలా కృశించిపోయింది, కాంతిని అంతటిని కోల్పోయింది. ఆ విధంగానే, దేశకాలనియమాలను ఉల్లంఘించి, అనధ్యయన దినాలలో, అధ్యయనం చేయకూడని ప్రదేశాలలో అభ్యసించే వేద విద్య కృశించిపోతుంది.

అందువల్ల మనం కూడా వేద విద్యను విధింపబడిన నియమాల ప్రకారం అధ్యయనం చేద్దాం. వేదవిద్య క్షీణించి పోకుండా కాపాడుకుందాం.

ఇప్పుడు సుందరకాండలోనే ఇంకొక సందర్భాన్ని చూద్దాం. రావణుడు అపరరాత్రికాలంలో నిద్ర నుండి లేచి, తన అంతఃపురం నుండి అశోకవనంలో ఉండే సీత దగ్గరకు వచ్చే సందర్భం ఇది. అప్పుడు అతడు వచ్చే దారిలో

" షడంగవేదవిదుషాం క్రతుప్రవరయాజినామ్,
శుశ్రావ బ్రహ్మఘోషాం సః విరాత్రే బ్రహ్మరక్షసామ్"
రాక్షసులలో కొంతమంది బ్రాహ్మణులు ఉన్నారు. వారికి బ్రహ్మరక్షసులు అని పేరు. వారు ఆ అపరరాత్రి కాలంలో ఏమి చేస్తున్నారు? అంటే, వేదఘోషను చేస్తున్నారు. ఆ ఘోషను వింటూ ర రావణుడు సీత దగ్గరకు బయలుదేరాడు.

సుందరకాండలోనే ఇంకొక సూక్తిని గమనిద్దాం ఇది సీత తన మనసులో స్వగతంగా పలికే వచనం. రావణుడు పలికి కఠినమైన మాటలను విని మనస్సులో చాలా పరితాపాన్ని పొందిన సీత, తన మనసులో ఈ విధంగా భావిస్తున్నది.

"భావం న చాస్యాహ మనుప్రదాతుమ్
అలం ద్విజో మంత్రమివాద్విజాయ"

"నా మనస్సు రామునకు మాత్రమే సొంతం. దానిని నేను ఏ విధంగా రావణునకు వశం చేయగలను? " అనేది ఇక్కడ సీతాదేవి ఈ మాటలను పలకడంలోని తాత్పర్యం. అయితే ఇది స్పష్టంగా లేదు. ధ్వనిస్తున్నది. అందువల్లనే గోవిందరాజీయ వ్యాఖ్యానంలో " అస్య అస్మిన్ రావణే, భావం హృదయం, అనుప్రదాతుమ్, నాలం న శక్తా, రామస్వత్వాత్ అస్య. న హ్యస్య స్వ మన్యోఽన్యస్మై దాతుమర్హతీతి భావః" అని వివరింపబడింది.

తన మనస్సును రావణునకు వశం చేయలేకపోవడానికి ఉదాహరణగా సీతాదేవి ఒక చక్కని ఉపమానాన్ని పలుకుతున్నది. ఏ విధంగా అయితే యోగ్యత లేని వానికి వేదమంత్రాన్ని ప్రదానం చేయడం సాధ్యం కాదో, ఆ విధంగానే, నేను నా మనస్సును, రామునకు తప్ప, యోగ్యత లేని రావణునకు ఇవ్వడం తగినది కాదు, ఇవ్వలేను, ఇవ్వను కూడా – అని సీతాదేవి మాటలలోని తాత్పర్యం. ఈ చమత్కారమైన అర్థం. "అలం ద్విజో మంత్రమివాద్విజాయ" అనే ప్రయోగంలోని "అలమ్" అనే పద ప్రయోగంద్వారా ధ్వనిస్తున్నది. " నేను ఇవ్వకూడదు, ఇవ్వలేను, ఇవ్వను" అని ఈ మూడు అర్థాలు ఇక్కడ వ్యక్తమవుతున్నాయి.

దీనికి ఒక దృష్టాంతాన్ని సీత పలుకుతున్నది. వేదమంత్రాన్ని యోగ్యత లేనివారికి ఇవ్వడం సాధ్యం కాదు కదా, ఇవ్వరు కదా, ఇవ్వకూడదు కదా–అని.

ఈ సందర్భంలో మనకు బోచరించే వేద మహిమలు ఏమంటే,

1) మంత్రాన్ని పొందడానికి యోగ్యత ఉండాలి. బ్రాహ్మణులై ఉండడం అనేది ఒక యోగ్యత, ఉపనయన సంస్కారాన్ని పొందడం అనేది ఇంకొక యోగ్యత. ద్విజుడు కానివానికి వేదమంత్రాన్ని ఇవ్వడం అనేది యోగ్యత లేని రావణునకు సీత తన మనసును ఇవ్వడంవంటిది.

నాకొక వేదమంత్రం తెలిసినది. నాకు స్నేహితుడు ఒకడు ఉన్నాడు అయినప్పటికీ నేను అతనికి ఆ మంత్రాన్ని ఇస్తాను –అని అంటే, అది ఎంత పాపమో తెలుసునా? సీత హృదయాన్ని రావణునకు ఇచ్చినంత మహా పాపం సుమా! అని వాల్మీకి ఇక్కడ మనకు తెలియజేస్తున్నారు. వేదమంత్రాల విషయంలో మనం చాలా జాగ్రత్త ఉండాలని తెలియజేస్తున్నారు.

వేదమంత్రం యోగ్యత లేని వానికి ఇవ్వకూడదు –అనేది తోక ప్రసిద్ధమైన విషయం కనుక, దానిని వాల్మీకి ఇక్కడ దృష్టాంతంగా పలుకుతున్నారు.

దృష్టాంత దార్ ష్టాంతికాలను మార్చి చూసినప్పుడు, అధికారం లేనివానికి వేదమంత్రాన్ని ఇవ్వడం అనేది రావణనకు సీత యొక్క హృదయాన్ని ఇవ్వడం వంటిది, అంతటి మహా పాపం– అని ఏర్పడుతున్నది.

ఇప్పుడు యుద్ధకాండలో ఒక సూక్తిని గమనిద్దాం. రావణ వధానంతరం బ్రహ్మ శ్రీరామచంద్రుని స్తుతించే సందర్భంగా ఇది బ్రహ్మ శ్రీరాముని ఈ విధంగా కీర్తిస్తున్నాడు.

సహస్రశృంగో వేదాత్మా.
సంస్కారా స్త్వభవన్ వేదాః.

రామచంద్రా! నీవు సాక్షాత్తు పరమాత్మవు. దశరథునకు కుమారునిగా అవతరించావు. నీవు వేదాత్మవు. వేదమే శృంగంగా కలిగిన వాడవు. వేయి శృంగాలను కలవాడవు.

వేదాలు పరమాత్మ యొక్క విశ్వాస రూపాలు. ప్రళయ కాలంలో అవి అంతర్హితంగా ఉన్నాయి. అటువంటి పరమాత్మవే నీవు. ఇప్పుడు రాముడవై అవతరించావు.

ఇక్కడ మనకు గోచరించే విశేషాలు ఏమంటే–

1) శ్రీరాముడే వేదాత్మ, అంటే, వేద రూపుడు. అంటే వేదం కూడా శ్రీరాముని రూపాలలో ఒకటి,

2) అన్నీ లయాన్ని పొందే ప్రళయ కాలంలో కూడా వేదాలు నశించడం లేదు. భగవానుని సంకల్పంవల్ల అతని సంస్కారాలుగా నిలచి ఉంటాయి. వాటిని సృష్టికాలంలో మళ్లీ భగవంతుడు స్మరిస్తాడు. నిద్రపోయినవాడు మళ్ళీ తిరిగి లేవగానే అతడి సంస్కారాలన్నీ గుర్తుకు వచ్చినట్లే ఇది కూడా. ఈ విషయాన్ని ఆళ్వారులు "ఉణర్ న్దాయ్ మఱై నాన్గుమ్" (నాలుగు వేదాలను నీవు సృష్టి కాలంలో స్మరించావు) అన్నారు.

2) భగవంతుని స్తుతించేటప్పుడు అతనికి వేదంతో గల సంబంధాన్ని పురస్కరించుకొని స్తుతిస్తే, అది గొప్ప స్తుతి అవుతుంది. బ్రహ్మ కూడా ఆ విధంగానే స్తుతించాడు. మహర్షులు కూడా ఆ విధంగానే స్తుతిని చేశారు ఇటువంటి స్తుతులు మనకు ఇతిహాస పురాణాలలో చాలా కనిపిస్తాయి.

3) సహస్ర శృంగ శబ్దం వేదంలో కనబడుతున్నందున భగవంతుని చేసే స్తుతులను వైదిక పదాలతో మేళవించి చేస్తే అది గొప్ప స్తుతి కాగలదు

4) వేదానికి గల వేయి శాఖలను సహస్రశృంగా పదంతో ఇక్కడ నిర్దేశించడం జరిగింది.

ఇంకా చివరిగా ఉత్తరకాండంలో ఒక సూక్తి.

వాల్మీకి భగవానుడు రామాయణ వైభవాన్ని గురించి ఈ విధంగా పలుకుతున్నాడు. ఇందులో వేద మహిమ కూడా ఇమిడి ఉన్నది.

"రామాయణం వేదసమం శ్రాద్ధేషు శ్రావయేత్ బుధః".

శ్రీ రామాయణం వేదంతో సమానమైనది దానిని శ్రాద్ధ కర్మలను ఆచరించే కాలంలో పారాయణ చేయడం మంచిది.

రామాయణం ఎంత గొప్పదో తెలుసునా అది వేదంతో సమానమని వాల్మీకి ఇక్కడ అంటున్నారు. వాల్మీకి కాలంలో వేదం ఎంత గొప్పదో అందరికీ తెలిసినదే అందుచేత వేదంతో సమానంగా రామాయణాన్ని వాల్మీకి మహర్షి పలుతున్నారు. వేదం ప్రాచీనమైనది, ప్రసిద్ధమైనది. కానీ, శ్రీరామాయణం అప్పుడే అవతరించింది. దాని గొప్పతనాన్ని లోకానికి తెలియజేయాలని

అనుకున్నారు, వాల్మీకి మహర్షి. అందుచేత లోకంలో ఎంతో ప్రసిద్ధమైనదిగా, పవిత్రమైనదిగా, ఉన్నతమైనదిగా, ఎన్నో విధాలైన రహస్యార్థాలతో నిండినదిగా భావింపబడే వేదంతో సమానంగా శ్రీరామాయణాన్ని వాల్మీకి పలుకుతున్నారు –అని గమనించాలి. ఏ విధంగా అయితే వేదాన్ని మీరు గొప్పగా భావించి, దానిని కీర్తించి అనుసంధిస్తున్నారో, ఆ విధంగానే ఈ రామాయణాన్ని కూడా గొప్పగా భావించి, కీర్తించి, అనుసంధించండి– అని వాల్మీకి పలికిన ఈ మాటలలోని తాత్పర్యం.

అంతేకాదు, " శ్రాద్ధేషు శ్రావయేత్ బుధః".

అని ఇంకొక మాటను కూడా ఇక్కడ వాల్మీకి పలుకుతున్నారు. శ్రాద్ధసమయాలలో భోక్తలు భుజించేటప్పుడు కొన్ని నిర్దిష్టమైన అన్న సూక్తం వంటి వేదమంత్రాలను పెద్దలు అనుసంధించడం అలవాటు ఉన్నది దీనికి అభిశ్రవణం అని పేరు. ఆ విధంగా అనుసంధించే మంత్రాలను వింటూ భోక్తలు భుజిస్తారు. ఈ విధంగా వేదమంత్రాల అనుసంధానంతో అభిశ్రవణం చేసేటప్పుడు ఆ వేదమంత్రాలతో పాటుగా శ్రీరామాయణంలోని శ్లోకాలను కూడా అనుసంధించవచ్చు –అని అంటున్నారు, వాల్మీకి. దీనివల్ల, శ్రాద్ధసమయంలో వేదమంత్రాలను అనుసంధించడం వల్ల ఎటువంటి పుణ్యం లభిస్తుందో, అటువంటి పుణ్యమే శ్రీరామాయణానుసంధానం వల్లకూడా లభిస్తుంది –అని మనకు సూచించినట్లయినది. దీనివల్ల వేద మహిమ మనకు ఒక విధంగా స్పష్టమవుతున్నది.

ఈ విధంగా వాల్మీకి ప్రతి కాండలోనూ వేదమహిమను పలువారిలో ప్రసాదించి కీర్తించినట్లు మనకు స్పష్టంగా

గోచరిస్తుంది. ఇటువంటి విశేషాలనే తిరుమలనంబి భగవద్రామానులకు అనుగ్రహించారు. వారు 18 పర్యాయాలు 18 విధాలయిన శ్రీరామాయణంలోని విశేషాలను తెలియజేప్పినప్పుడు, వాటిలో మొదటి అర్థం శ్రీరామాయణం వేదసమం అనే విషయమే.

ఒక గ్రంథం యొక్క గొప్పతనాన్ని తెలియజేయాలంటే, దానిని వేదంతో సమానంగా చెప్పడం కంటే గొప్ప విధానం వేరొకటి లేదు. ఆ పనిని వాల్మీకి మహర్షి చేశారు, వ్యాసులు కూడా చేశారు. మహాభారతాన్ని వేద సమానంగా వ్యాసులు కీర్తించారు కదా. ఆ విధంగానే పలు గ్రంథాలు కూడా కీర్తింపబడినప్పుడు అవి వేదసమంగా చెప్పబడ్డాయి.

వేదం పవిత్రమైనది, ఉన్నతమైనది, మంగళాలను ప్రసాదించగలిగినది, దివ్య దంపతుల వైభవాన్ని కీర్తిస్తున్నది, చతుర్విధ పురుషార్థాలను ఇవ్వగలిగినది. శ్రీరామాయణం కూడా ఇటువంటి వైభవాన్ని కలిగినది.

పైన విన్నవించిన రీతిలో శ్రీరామాయణంలో పతికాండలోనూ వేద వైభవం పలుమార్లు ప్రశంసింపబడింది. ఇంతవరకు మనం గమనించిన విషయాలు క్లుప్తంగా ఏమంటే–

1) శ్రీరామాయణం వేదావతారం

2) కుశలవులు వేదంలో పరినిష్ఠను కలిగి ఉన్నందువల్లనే వారిని రామాయణ ప్రచారం కోసం వాల్మీకి మహర్షి స్వీకరించాడు.

3) కౌసల్య యొక్క అంతఃపురంలో నిత్యం వేద పండితులు వేద పారాయణం చేసేవారు

4) శ్రీరాముడు వనానికి వెళ్లేటప్పుడు కౌసల్య అతనికి వేదంతో స్వస్తివాచనం పలికింది.

5) వేద పండితులు దానాన్ని ఇవ్వడానికి చక్కని అర్హతను కలిగినవారు.

6) సీత వేద శ్రుతి వంటిది.

7 శ్రుతిని బలాత్కారంగా వేరొక విధంగా మార్చడానికి వీలు లేనట్లే, సీతను అపహరించి బలాత్కారంగా కొనిపోవడం సాధ్యం కాదు. అని జటాయువు అన్నాడు.

8) అదృశ్యమైన వేదాన్ని తిరిగి సంపాదించేటట్లే, రావణుడు తీసుకుని పోయిన సీతను మళ్ళీ తిరిగి సంపాదించవచ్చు –అని అన్నాడు, సుగ్రీవుడు.

8) అశోకవనంలో ఉండే సీత నియమాలను ఉల్లంఘించి అధ్యయనం చేసిన శ్రుతి వలె క్షీణించి ఉన్నది –అని వాల్మీకి అన్నారు.

9) వేదం భగవానులకు విశ్వాస రూపం. వేదం భగవంతుని అవతారరూపం, వేదం ప్రళయకాలలో భగవంతుని సంకల్పం చేత నిలిచి ఉండి, మళ్ళీ సృష్టికాలంలో భగవంతుని సంకల్పం చేతనే వ్యక్తమవుతున్నది.

10) వేదాన్ని శ్రాద్ధకాలాలలో అనుసంధానం చేసే సంప్రదాయం ఉన్నదని విషయాన్ని మనకు వాల్మీకి గుర్తు చేస్తున్నారు.

ఈ విధంగా వాల్మీకి రామాయణంలో వేద మహిమ మనకు పదే పదే గోచరిస్తున్నది. ఈ విధంగా వేద మహిమను అనుసంధానం చేసికునే భాగ్యాన్ని, కొంతవరకు శ్రీరామాయణ గాథను కూడా స్మరించుకోగలిగిన అదృష్టాన్ని మనం పొందగలిగాము.

